# శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము

ప్రతిపదార్థసహితము



వివరణ :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి M.A.Ph.D

## శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమహిమ

"సర్వం విష్ణుమయం జగత్"

స్థలం విష్ణుః, జలం విష్ణుః, విష్ణురాకాశముచ్యతే।
స్థావరం జంగమంవిష్ణుః సర్వం విష్ణుమయం జగత్॥

చరాచరమగు ఈ జగమంతయు ఆ శ్రీ మహావిష్ణువే అని పై వాక్యమునకు అర్థము.

పంచమవేదమైన మహాభారతములో, అనుశాసనిక పర్వమున భీష్మ యుధిష్ఠిరుల సంవాదరూపమున వ్యాసభగవానుడు లోకమునకు ప్రసాదించిన ఉత్తమ విద్య ఈ విష్ణు సహస్రనామము.

"ఏదైవమును ఆశ్రయించి, ఏవిధముగ, సేవించిన మానవులు శుభములు పొందుదురు? దేనిని జపించుటవలన జీవులకు సంసారబంధములనుండి విముక్తి లభించును? ధర్మములందెయ్యది మిక్కిలి శ్రేష్ఠము"? అని, అడిగిన ధర్మరాజు ప్రశ్నలకు ధర్మజ్ఞుడైన భీష్ముడు "ఆదిదేవుడు, మహాదేవుడైన ఆ పురుషోత్తముని నిత్యము సహస్రనామముల ద్వారా స్తుతింపవలయు"నని సూచించుచు, "సర్వలోకమహేశ్వరుడైన ఆ విష్ణు(విశ్వ)మూర్తిని అర్చించి, ధ్యానించి స్తుతించుటవలన మానవులు సర్వదుఃఖములను అధికమించగలరని చెప్పి ఇదియే పరమ ధర్మమని తెలుపుచు, ఆ విశ్వేశ్వరుని వైభవమును వేయివిధముల నిరూపించినాడు. పూర్వమెందఱో ఋషులు వాసుదేవుని విశేషముగా కీర్తించిన ఈ సహస్రనాములు భక్తి పరాయణులై పారాయణము చేయువారికి ఆజగన్నాథుడు ప్రీతితో సకల శుభములను, సుఖములను ప్రసాదించునని వివరించినాడు.

ఈ సహస్ర నామములు భక్తి శ్రద్ధలతో పఠించు భక్తులకు, పరమాత్మ మనోభీష్టములను దీర్చును. ఆ వాసుదేవుని దయవలన వారికి జన్మమృత్యు, జరా, వ్యాధి, భయములు తొలగిపోవును. ఈ సమస్త విశ్వము ఆ ఆదిదేవుని వలన, సృష్టింపబడి, పోషింపబడి, తుదకు ఆయనయందే లయమందుచున్నది. సకల విద్యలు, విజ్ఞానములు, తేజో, బలములు ఆజనార్దనుని వలన ఏర్పడుచున్నవి. ఒకే శక్తి ఇన్ని రూపములుగా వ్యాప్తి చెందిన విషయము కీర్తింపబడుచు, ఈ సహస్రనామములందలి ప్రతినామము లోకములకు ఆదికారణమైన ఆమహాదేవుని గూర్చిన విశేష విజ్ఞానమును ఒసంగుచు, ముక్తి మార్గసోపానములై విలసిల్లుచున్నవి. దారిద్ర్యమోచనమగు లక్ష్మ్యష్టోత్తర శతనామములు మిక్కిలి మహిమగలవై పారాయణార్హములగుటచే ఇందు చేర్చబడినవి. పూర్వమెందఱో పూజ్యులు ఈ సహస్రనామములకు అర్థములు వ్రాసి, ప్రకటించి ఆపరమేశ్వరుని కృపకు పాత్రులైనారు. నా ఈ ప్రయత్నమునకు మహనీయులగు వారి రచనలు ఉపకరించినందులకు వారందఱికి కృతజ్ఞతలు ఘటించుచున్నాను. నాకృషిని అభినందించుచు, శుభాశీస్సులందించిన గురువులు శ్రీ ధూళిపాళ రాధాకృష్ణమూర్తి (హైదరాబాద్) గారికి నా నమస్సుమనస్సులు సమర్పించుచున్నాను.

డాక్టర్, తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి M.A. Phd.

## శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రమ్

### ధ్యానమ్

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాన్తయే ॥

శారదా శారదామ్భోజవదనా వదనామ్బుజే ।
సర్వదా సర్వదాస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్ ॥

గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

జ్ఞానానన్దమయం దేవం నిర్మల స్ఫటికాకృతిమ్ ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః ।
గరుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః ॥

వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేఃపౌత్ర మకల్మషమ్ ।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్ ॥

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే ।
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః ॥

అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే ।
సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥

యస్యస్మరణమాత్రేణ జన్మసంసారబన్ధనాత్ ।
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥

ఓంనమో విష్ణవే ప్రభవిష్ణవే
సచ్చిదానన్దరూపాయ కృష్ణాయా ఉక్లిష్టకారిణే(కర్మణే) ।
నమో వేదాన్తవేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే ॥

కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితే రతమ్ ।
వేదాబ్జభాస్కరం వన్దే శమాది నిలయం మునిమ్ ॥

సహస్రమూర్తేః పురుషోత్తమస్య సహస్రనేత్రానన పాదబాహోః ।
సహస్రనామ్నాం స్తవనం ప్రశస్తం నిరుచ్యతే జన్మజరాది శాన్త్యై ॥

## పూర్వపీఠికా

శ్రీవైశంపాయనఉవాచ!
శ్రుత్వా ధర్మా నశేషేణ పావనాని చ సర్వశః ।
యుధిష్ఠరశ్శాన్తనవం పునరేవాభ్యభాషత ॥

యుధిష్ఠిర ఉవాచ!
కిమేకం దైవతం లోకే కింవాప్యేకం పరాయణమ్ ।
స్తువన్తః కం కమర్చన్తః ప్రాప్నుయుర్మానవాశ్శుభమ్ ॥

కో ధర్మ స్సర్వధర్మాణాం భవతః పరమో మతః ।
కిం జప న్ముచ్యతే జన్తు ర్జన్మసంసారబన్ధనాత్ ॥

జగత్ప్రభుం దేవదేవ మనన్తం పురుషోత్తమమ్ ।
స్తువన్నామ సహస్రేణ పురుషస్సతతోత్థితః॥

తమేవ చార్చయన్నిత్యం భక్త్యా పురుషమవ్యయమ్ ।
ధ్యాయన్ స్తువన్నమస్యంశ్చ యజమాన స్తమేవ చ ॥

అనాదినిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరమ్ ।
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్ ॥

బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్ ।
లోకనాథం మహద్భూతం సర్వభూత భవోద్భవమ్ ॥

ఏష మే సర్వధర్మాణాం ధర్మో ఽధికతమో మతః ।
యద్భక్త్యా పుణ్డరీకాంక్షం స్తవైరర్చేన్నర స్సదా ॥

పరమం యో మహత్తేజః పరమం యో మహత్తపః ।
పరమం యో మహద్బ్రహ్మ పరమం యః పరాయణమ్ ॥

పవిత్రాణాం పవిత్రం యో మఙ్గళానాం చ మఙ్గళమ్।
దైవతం దేవతానాం చ భూతానాం యో ఽ వ్యయః పితా ॥

యతస్సర్వాణి భూతాని భవన్త్యాది యుగాగమే ।
యస్మింశ్చ ప్రళయం యాన్తి పునరేవ యుగక్షయే ॥



తస్యలోకప్రధానస్య జగన్నాథస్య భూపతే ।
విష్ణోర్నామసహస్రం మే శృణు పాపభయాపహమ్ ॥

యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః ।
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే ॥

ఋషిర్నామ్నాం సహస్రస్య వేదవ్యాసో మహామునిః ।
ఛన్దో ఽనుష్టు ప్తథా దేవో భగవాన్ దేవకీసుతః ॥

అమృతాంశూద్భవో బీజం శక్తిర్దేవకినన్దనః ।
త్రిసామా హృదయం తస్య శాన్త్యర్థే వినియుజ్యతే ॥

విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరమ్ ।
అనేకరూప(ం)దైత్యాన్తం నమామి పురుషోత్తమమ్ ॥

**అస్య శ్రీ విష్ణోర్దివ్యసహస్రనామస్తోత్రమహామన్త్రస్య శ్రీవేదవ్యాసో భగవాన్ ఋషిః అనుష్టుప్ ఛన్దః శ్రీమహావిష్ణుః పరమాత్మా శ్రీమన్నారాయణో దేవతా. అమృతాంశూద్భవో భానురితి బీజమ్. దేవకీనన్దనస్స్రష్టేతి శక్తిః ఉద్భవః క్షోభణో దేవ ఇతి పరమో మన్త్రః శఙ్ఖభృన్నన్దకీ చక్రీతి కీలకమ్. శార్ఙ్గధన్వా గదాధర ఇత్యస్త్రమ్. రథాఙ్గపాణిరక్షోభ్య ఇతి నేత్రమ్. త్రిసామా సామగస్సామేతి కవచమ్. ఆనన్దం పరబ్రహ్మేతి యోనిః ఋతుస్సుదర్శనః కాల ఇతి దిగ్బన్ధః విశ్వరూప ఇతి ధ్యానమ్. శ్రీమహావిష్ణు ప్రీత్యర్థే శ్రీమహావిష్ణోర్దివ్య సహస్రనామస్తోత్ర మాలజపే వినియోగః**

**ధ్యానమ్**

క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణివిలసత్సైకతే మౌక్తికానాం
మాలాక్లప్తాసనస్థస్స్ఫటికమణినిభైర్మౌక్తికైర్మణ్డితాఙ్గః ।
శుభ్రైరభ్రైరదభ్రైరుపరివిరచితైర్ముక్తపీయూషవర్షై-
రానన్దీ నః పునీయాదరినళినగదాశఙ్ఖపాణిర్ముకున్దః ॥

భూః పాదౌ యస్య నాభిర్వియదసురనిలశ్చన్ద్రసూర్యౌ చ నేత్రే
కర్ణావాశాశ్శిరోద్యౌ ర్ముఖమపి దహనో యస్య వా(స్తో)స్తేయమబ్ధిః ।
అన్తస్థం యస్య విశ్వం సురనరఖగగోభోగిగన్ధర్వదైత్యై-
శ్చిత్రం రంరమ్యతే తం త్రిభువనవపుషం విష్ణుమీశం నమామి।

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాఙ్గమ్ ।
లక్ష్మీకాన్తం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యమ్
వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥

సశఙ్ఖచక్రం సకిరీటకుణ్డలం
సపీతవస్త్రం సరసీరుహేక్షణమ్ ।
సహారవక్షస్థలశోభికౌస్తుభమ్
నమామి విష్ణుం శిరసా చతుర్భుజమ్॥

మేఘశ్యామం పీతకౌశేయవాసం
శ్రీవత్సాఙ్కం కౌస్తుభోద్భాసితాఙ్గమ్ ।
పుణ్యోపేతం పుణ్డరీకాయతాక్షమ్।
విష్ణుం వన్దే సర్వలోకైకనాథమ్ ॥

ఛాయాయాం పారిజతస్య హేమసింహాసనోపరి ।
ఆసీనమమ్బుదశ్యామమాయతాక్షమలఙ్కృతమ్ ॥

చన్ద్రాననం చతుర్బాహుం శ్రీవత్సాఙ్కిత వక్షసమ్ ।
రుక్మిణీసత్యభామాభ్యాం సహితం కృష్ణమాశ్రయే ॥



# శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రమ్

1. విశ్వం, విష్ణు, ర్వషట్కారో, భూతభవ్య భవత్ప్రభుః,।
భూతకృ, ద్భూతభృ, ద్భావో, భూతాత్మా, భూతభావనః,॥

2. పూతాత్మా, పరమాత్మా,చ ముక్తానాం పరమాగతిః।
అవ్యయః, పురుష, స్సాక్షీ, క్షేత్రజ్ఞో,ఽక్షర, ఏవచ,॥

3. యోగో, యోగవిదాంనేతా, ప్రధాన పురుషేశ్వరః,।
నారసింహవపు, శ్శ్రీమాన్, కేశవః, పురుషోత్తమః,॥

4. సర్వ, శ్శర్వ, శ్శివ, స్థాణు, ర్భూతాది, ర్నిధి రవ్యయః,।
సంభవో, భావనో, భర్తా, ప్రభవః, ప్రభు, రీశ్వరః,॥

5. స్వయంభూ, శంభు, రాదిత్యః, పుష్కరాక్షో, మహాస్వనః,।
అనాదినిధనో, ధాతా, విధాతా, ధాతురుత్తమః,॥

6. అప్రమేయో, హృషీకేశః, పద్మనాభో, ఽమరప్రభుః,।
విశ్వకర్మా, మను, స్త్వష్టా, స్థ విష్ఠ, స్థవిరో ధ్రువః,॥

7. అగ్రాహ్య శ్శాశ్వతః కృష్ణో,లోహితాక్షః ప్రతర్దనః,।
ప్రభూత, స్త్రికకుబ్ధామ, పవిత్రం, మంగళం పరమ్,॥

8. ఈశానః, ప్రాణదః, ప్రాణో, జ్యేష్ఠ, శ్శ్రేష్ఠః, ప్రజాపతిః,।
హిరణ్యగర్భో, భూగర్భో, మాధవో, మధుసూదనః,॥

9. ఈశ్వరో, విక్రమీ, ధన్వీ, మేధావీ, విక్రమః, క్రమః,।
అనుత్తమో, దురాధర్షః, కృతజ్ఞః, కృతి, రాత్మవాన్,॥

10. సురేశ, శ్శరణం, శర్మ, విశ్వరేతాః, ప్రజాభవః,।
అహ, స్సంవత్సరో, వ్యాళః, ప్రత్యయ, స్సర్వదర్శనః,॥

11. అజ, స్సర్వేశ్వర, స్సిద్ధ, స్సిద్ధి, స్సర్వాది, రచ్యుతః,।
వృషాకపి, రమేయాత్మా, సర్వయోగవినిస్సృతః,॥

12. వసు, ర్వసుమనా, స్సత్య, స్సమాత్మా, ఽసమ్మిత, స్సమః,।
అమోఘః, పుండరీకాక్షో, వృషకర్మా, వృషాకృతిః,॥

13. రుద్రో, బహుశిరా, బభ్రు, ర్విశ్వయోని, శ్శుచిశ్రవాః,।
అమృత, శ్శాశ్వతస్థాణు, వరారోహో, మహాతపాః,॥

14. సర్వగ, స్సర్వవిద్భాను, విష్వక్సేనో, జనార్దనః,।
వేదో, వేదవి, దవ్యంగో, వేదాంగో, వేదవి, త్కవిః,॥

15. లోకాధ్యక్ష, స్సురాధ్యక్షో, ధర్మాధ్యక్షః, కృతాకృతః,।
చతురాత్మా, చతుర్వ్యూహ, శ్చతుర్దంష్ట్ర, శ్చతుర్భుజః,॥

16. భ్రాజిష్ణు, ర్భోజనం, భోక్తా, సహిష్ణు, ర్జగదాదిజః,।
అనఘో, విజయో, జేతా, విశ్వయోనిః, పునర్వసుః,॥

17. ఉపేంద్రో, వామనః, ప్రాంశు, రమోఘ, శ్శుచి, రూర్జితః,।
అతీంద్ర, స్సంగ్రహ, స్సర్గో, ధృతాత్మా, నియమో, యమః,॥

18. వేద్యో, వైద్య, సదాయోగీ, వీరహా, మాధవో, మధుః,।
అతీంద్రియో, మహామాయో, మహోత్సాహో, మహాబలః,॥

19 మహాబుద్ధి, ర్మహావీర్యో, మహాశక్తి, ర్మహాద్యుతిః,।
అనిర్దేశ్యవపు, శ్శ్రీమా, నమేయాత్మా, మహాద్రిధృక్,॥

20. మహేష్వాసో, మహీభర్తా, శ్రీనివాస, స్సతాంగతిః,।
అనిరుద్ధ, స్సురానందో, గోవిందో, గోవిదాంపతిః,॥

21. మరీచి, ర్దమనో, హంస, సుపర్ణో, భుజగోత్తమః,।
హిరణ్యనాభ, స్సుతపాః, పద్మనాభః ప్రజాపతిః,॥

22. అమృత్యు, స్సర్వదృ, క్సింహ, స్సంధాతా, సంధిమాన్, స్థిరః,।
అజో, దుర్మర్షణ, శ్శాస్తా, విశ్రుతాత్మా, సురారిహా,॥

23. గురు, ర్గురుతమో, ధామ, సత్య, స్సత్యపరాక్రమః,।
నిమిషో, ఽనిమిష, స్స్రగ్వీ, వాచస్పతిరుదారధీః,॥

24. అగ్రణీ, ర్గ్రామణీ, శ్శ్రీమా, న్న్యాయో, నేతా, సమీరణః,।
సహస్రమూర్ధా, విశ్వాత్మా, సహస్రాక్ష, స్సహస్రపాత్,।

25. ఆవర్తనో, నివృత్తాత్మా, సంవృత, స్సంప్రమర్దనః,।
అహస్సంవర్తకో, వహ్ని, రనిలో, ధరణీధరః,॥

26. సుప్రసాదః, ప్రసన్నాత్మా, విశ్వధృ, గ్విశ్వభు, గ్విభుః,।
సత్కర్తా సత్కృత, స్సాధు, ర్జహ్ను, ర్నారాయణో, నరః,॥

27. అసంఖ్యేయో, ఽప్రమేయాత్మా, విశిష్టః, శ్శిష్టకృ, చ్ఛుచిః,।
సిద్ధార్థ, స్సిద్ధసంకల్పః, స్సిద్ధిద, స్సిద్ధిసాధనః,॥



28. వృషాహీ, వృషభో, విష్ణు ర్వృషపర్వా, వృషోదరః,।
వర్ధనో, వర్ధమానశ్చ, వివిక్త, శ్శ్రుతిసాగరః,॥

29. సుభుజో, దుర్ధరో, వాగ్మీ, మహేంద్రో, వసుదో, వసు(ః),।
నైకరూపో, బృహద్రూపః, శ్శిపివిష్టః, ప్రకాశనః,॥

30. ఓజస్తేజోద్యుతిధరః, ప్రకాశాత్మా, ప్రతాపనః,।
ఋద్ధ స్స్పష్టాక్షరో, మంత్ర, శ్చంద్రాంశు, ర్భాస్కరద్యుతిః,॥

31. అమృతాంశూద్భవో, భాను, శ్శశిబిందు, స్సురేశ్వరః,।
ఔషధం, జగతస్సేతు, స్సత్యధర్మపరాక్రమః,॥

32. భూతభవ్యభవన్నాథః, పవనః, పావనో, ఽనలః,।
కామహా, కామకృ, త్కాంతః, కామః, కామప్రదః, ప్రభుః,॥

33. యుగాదికృ, ద్యుగావర్తో, నైకమాయో, మహాశనః,।
అదృశ్యో, వ్యక్తరూపశ్చ, సహస్రజి, దనంతజిత్,॥

34. ఇష్టో, విశిష్ట, శ్శిష్టేష్ట, శ్శిఖండీ, నహుషో, వృషః,।
క్రోధహా, క్రోధకృత్కర్తా, విశ్వబాహు, ర్మహీధరః,॥

35. అచ్యుతః, ప్రథితః, ప్రాణః, ప్రాణదో, వాసవానుజః,।
అపాంనిధి, రధిష్ఠాన, మప్రమత్తః, ప్రతిష్ఠితః,॥

36. స్కంద, స్స్కందధరో, ధుర్యో, వరదో, వాయువాహనః,।
వాసుదేవో, బృహద్భాను, రాదిదేవః, పురందరః,॥

37. అశోక, స్తారణ, స్తార, శ్శూర, శ్శౌరి, ర్జనేశ్వరః,।
అనుకూల, శ్శతావర్తః, పద్మీ పద్మనిభేక్షణః,॥

38. పద్మనాభో, ఽరవిందాక్షః, పద్మగర్భ, శ్శరీరభృత్,।
మహర్ధిర్, ఋద్ధో, వృద్ధాత్మా, మహాక్షో, గరుడధ్వజః,॥

39. అతుల, శ్శరభో, భీమ, స్సమయజ్ఞో, హవిర్హరిః,।
సర్వలక్షణలక్షణ్యో, లక్ష్మీవా, న్సమితింజయః,॥

40. విక్షరో, రోహితో, మార్గో, హేతు, ర్దామోదర, స్సహః,।
మహీధరో, మహాభాగో, వేగవా, నమితాశనః,॥

41. ఉద్భవః, క్షోభణో, దేవ, శ్శ్రీగర్భః, పరమేశ్వరః,।
కరణం, కారణం, కర్తా వికర్తా, గహనో, గుహః,॥

42. వ్యవసాయో,వ్యవస్థానః, స్సంస్థాన, స్థానదో, ధృవః,।
పరర్ధిః, పరమస్పష్ట, స్తుష్టః, పుష్ట, శ్శుభేక్షణః,॥

43. రామో, విరామో, విరతో(జో), మార్గో, నేయో, నయో, ఉనయః।
వీర, శ్శక్తిమతాంశ్రేష్ఠో, ధర్మో, ధర్మవిదుత్తమః,॥

44. వైకుంఠః, పురుషః, ప్రాణః, ప్రాణదః, ప్రణవః, పృథుః,।
హిరణ్యగర్భ, శ్శత్రుఘ్నో, వ్యాప్తో, వాయు, రధోక్షజః,॥

45. ఋతుః, స్సుదర్శనః, కాలః, పరమేష్ఠీ, పరిగ్రహః,।
ఉగ్ర, స్సంవత్సరో, దక్షో, విశ్రామో, విశ్వదక్షిణః,॥

46. విస్తార, స్థావరస్థాణుః, ప్రమాణం, బీజమవ్యయమ్,।
అర్థో, ఉనర్థో, మహాకోశో, మహాభాగో, మహాధనః,॥

47. అనిర్విణ్ణ, స్థవిష్ఠోఉభూ, ర్ధర్మయూపో, మహామఖః,।
నక్షత్రనేమి, ర్నక్షత్రీ, క్షమః, క్షామ, స్సమీహనః,॥

48. యజ్ఞ, ఇజ్యో, మహేజ్యశ్చ, క్రతు, స్సత్రం, సతాంగతిః,।
సర్వదర్శీ, విముక్తాత్మా, సర్వజ్ఞో, జ్ఞానముత్తమమ్,॥

49. సువ్రత, స్సుముఖ, స్సూక్ష్మ, స్సుఘోష, స్సుఖద, స్సుహృత్,।
మనోహరో, జితక్రోధో, వీరబాహు, ర్విదారణః,॥

50. స్వాపన, స్స్వవశో, వ్యాపీ, నైకాత్మా, నైకకర్మకృత్,।
వత్సరో, వత్సలో, వత్సీ, రత్నగర్భో, ధనేశ్వరః,॥

51. ధర్మగు, బ్ధర్మకృ, ద్ధర్మీ, స, దసత్, క్షర, మక్షరం,।
అవిజ్ఞాతా, సహస్రాంశు, ర్విధాతా, కృతలక్షణః,॥

52. గభస్తినేమి, స్సత్త్వస్థ, స్సింహో, భూతమహేశ్వరః,।
ఆదిదేవో, మహాదేవో, దేవేశో, దేవభృద్గురుః,॥

53. ఉత్తరో, గోపతి, ర్గోప్తా, జ్ఞానగమ్యః, పురాతనః,।
శరీరభూతభృ, ద్భోక్తా, కపీంద్రో, భూరిదక్షిణః,॥

54. సోమపో, ఉమృతప, స్సోమ, పురుజి, త్పురుసత్తమః,।
వినయో, జయ, స్సత్యసంధో, దాశార్హ, స్సాత్వతాంపతిః,॥

55. జీవో, వినయితాసాక్షీ, ముకుందో, ఉ మితవిక్రమః,।
అంభోనిధి, రనన్తాత్మా, మహోదధిశయో, ఉన్తకః,॥



56. అజో, మహార్హ, స్స్వాభావ్యో, జితామిత్రః, ప్రమోదనః,।
ఆనందో, నందనో, నంద, స్సత్యధర్మా, త్రివిక్రమః,।

57. మహర్షిఃకపిలాచార్యః, కృతజ్ఞో, మేదినీపతిః,।
త్రిపద, స్త్రిదశాధ్యక్షో, మహాశృంగః, కృతాన్తకృత్,॥

58. మహావరాహో, గోవింద, స్సుషేణః, కనకాంగదీ,।
గుహ్యో, గభీరో, గహనో, గుప్త, శ్చక్రగదాధరః,॥

59. వేధా, స్స్వాంగో, ఉజితః, కృష్ణో, దృఢ, స్సంకర్షణో, ఉచ్యుతః,।
వరుణో, వారుణో, వృక్షః, పుష్కరాక్షో, మహామనాః,॥

60. భగవా, న్భగహా, ఉఉనందీ, వనమాలీ, హలాయుధః,।
ఆదిత్యో, జ్యోతిరాదిత్య, స్సహిష్ణు, ర్గతిసత్తమః,॥

61. సుధన్వా, ఖండపరశు, ర్దారుణో, ద్రవిణప్రదః,।
దివస్స్పృ, క్సర్వదృగ్వ్యాసో, వాచస్పతిరయోనిజః,॥

62. త్రిసామా, సామగ, స్సామ, నిర్వాణం, భేషజం, భిషక్,।
సంన్యాసకృ, చ్ఛమ, శ్శాంతో, నిష్ఠా, శాంతిః, పరాయణమ్,॥

63. శుభాంగ, శ్శాంతిద, స్స్రష్టా, కుముదః, కువలేశయః,।
గోహితో, గోపతి, ర్గోప్తా, వృషభాక్షో, వృషప్రియః,॥

64. అనివర్తీ, నివృత్తాత్మా, సంక్షేప్తా, క్షేమకృ, చ్ఛివః,।
శ్రీవత్సవక్షా, శ్శ్రీనివాస, శ్శ్రీపతి, శ్శ్రీమతాంవరః,॥

65. శ్రీద, శ్శ్రీశ, శ్శ్రీనివాస, శ్శ్రీనిధి, శ్శ్రీవిభావనః,।
శ్రీధర, శ్శ్రీకర, శ్శ్రేయ, శ్శ్రీమా, న్లోకత్రయాశ్రయః,॥

66. స్వక్ష, స్స్వంగ, శ్శతానందో, నంది, ర్జ్యోతిర్గణేశ్వరః,।
విజితాత్మా, ఉవిధేయాత్మా, సత్కీర్తి, శ్ఛిన్నసంశయః,॥

67. ఉదీర్ణ, స్సర్వతశ్చక్షు, రనీశ, శ్శాశ్వతస్థిరః,।
భూశయో, భూషణో, భూతి, ర్విశోక, శ్శోకనాశనః,॥

68. అర్చిష్మా, నర్చితః, కుంభో, విశుద్ధాత్మా, విశోధనః,।
అనిరుద్ధో, ఉప్రతిరథః, ప్రద్యుమ్నో, ఉ మితవిక్రమః,॥

69. కాలనేమినిహా, వీర, శ్శౌరి, శ్శూరజనేశ్వరః,।
త్రిలోకాత్మా, త్రిలోకేశః, కేశవః, కేశిహా, హరిః,॥

70. కామదేవః, కామపాలః, కామీ కాన్తః, కృతాగమః,।
అనిర్దేశ్యవపు, ర్విష్ణు, ర్వీరో, ఽ నన్తో, ధనంజయః,॥

71. బ్రహ్మణ్యో, బ్రహ్మకృ, ద్బ్రహ్మా, బ్రహ్మ, బ్రహ్మవివర్ధనః,।
బ్రహ్మవి, ద్బ్రాహ్మణో, బ్రహ్మీ, బ్రహ్మజ్ఞో, బ్రాహ్మణప్రియః,॥

72. మహాక్రమో, మహాకర్మా, మహాతేజా, మహోరగః,।
మహాక్రతు, ర్మహాయజ్వా, మహాయజ్ఞో, మహాహవిః,॥

73. స్తవ్య, స్తవప్రియ, స్తోత్రం, స్తుతిః, స్తోతా, రణప్రియః,।
పూర్ణః, పూరయితా, పుణ్యః, పుణ్యకీర్తి, రనామయః,॥

74. మనోజవ, స్తీర్థకరో, వసురేతా, వసుప్రదః,।
వసుప్రదో, వాసుదేవో, వసు, ర్వసుమనా, హవిః,॥

75. సద్గతి, స్సత్కృతి, స్సత్తా, సద్భూతి, స్సత్పరాయణమ్ః,।
శూరసేనో, యదుశ్రేష్ఠ స్సన్నివాస, స్సుయామునః,॥

76. భూతావాసో, వాసుదేవ, స్సర్వాసునిలయో, ఽ నలః,।
దర్పహా, దర్పదో, దృప్తో, దుర్ధరో, ఽ థా పరాజితః,॥

77. విశ్వమూర్తి, ర్మహామూర్తి, ర్దీప్తమూర్తి, రమూర్తిమాన్,।
అనేకమూర్తి, రవ్యక్త, శ్శతమూర్తి, శ్శతాననః,॥

78. ఏకో, నైక, స్సవః, కః, కిం, యత్త, త్పదమనుత్తమమ్,।
లోకబన్ధు, ర్లోకనాథో, మాధవో, భక్తవత్సలః,॥

79. సువర్ణవర్ణో, హేమాంగో, వరాంగ, శ్చందనాంగదీ,।
వీరహా, విషమ, శ్శూన్యో, ఘృతాశీ, రచల, శ్చలః,॥

80. అమానీ, మానదో, మాన్యో, లోకస్వామీ, త్రిలోకధృత్(క్),।
సుమేధా, మేధజో, ధన్య, స్సత్యమేధా, ధరాధరః,॥

81. తేజోవృషో, ద్యుతిధర, స్సర్వశస్త్రభృతాంవరః,।
ప్రగ్రహో, నిగ్రహో, వ్యగ్రో, నైకశృంగో, గదాగ్రజః,॥

82. చతుర్మూర్తి, శ్చతుర్బాహు, శ్చతుర్వ్యూహ, శ్చతుర్గతిః,।
చతురాత్మా, చతుర్భావ, శ్చతుర్వేదవి, దేకపాత్,॥

83. సమావర్తో, ఽ నివృత్తాత్మా, దుర్జయో, దురతిక్రమః,।
దుర్లభో, దుర్గమో, దుర్గో, దురావాసో, దురారిహా,॥



84. శుభాంగో, లోకసారంగ, స్సుతన్తు, స్తన్తువర్ధనః,।
ఇన్ద్రకర్మా, మహాకర్మా, కృతకర్మా, కృతాగమః,॥

85. ఉద్భవ, స్సుందర, స్సుందో, రత్ననాభ, స్సులోచనః,।
అర్కో, వాజసన, శ్శృంగీ, జయంత, స్సర్వవిజ్జయీ,॥

86. సువర్ణబిందు రక్షోభ్య, స్సర్వవాగీశ్వరేశ్వరః,।
మహాహ్రదో, మహాగర్తో, మహాభూతో, మహానిధిః,॥

87. కుముదః, కున్దరః, కుందః, పర్జన్యః, పావనోఽ నిలః।
అమృతాశో, ఽ మృతవపు, స్సర్వజ్ఞ, స్సర్వతోముఖః,॥

88. సులభ, స్సువ్రత, స్సిద్ధ, శ్శత్రుజి, చ్ఛత్రుతాపనః,।
న్యగ్రోధో, దుమ్బరో, ఽ శ్వత్థ, శ్చాణూరాంధ్రనిషూదనః,॥

89. సహస్రార్చి, స్సప్త జిహ్వ, స్సప్తైధా, స్సప్తవాహనః,।
అమూర్తి, రనఘో, ఽ చిన్త్యో, భయకృ, ద్భయనాశనః,॥

90. అణు, ర్బృహ, త్కృశ, స్థూలో, గుణభృ, న్నిర్గుణో, మహాన్,।
అధృత, స్స్వధృత, స్స్వాస్యః, ప్రాగ్వంశో, వంశవర్ధనః,॥

91. భారభృ, త్కథితో, యోగీ, యోగీశ, స్సర్వకామదః,।
ఆశ్రమ, శ్శ్రమణః, క్షామ, స్సుపర్ణో, వాయువాహనః,॥

92. ధనుర్ధరో, ధనుర్వేదో, దండో, దమయితా, దమః,।
అపరాజిత, స్సర్వసహో, నియన్తా, ఽ నియమో, ఽ యమః,॥

93. సత్త్వవా, న్సాత్త్విక, స్సత్య, స్సత్యధర్మపరాయణః,।
అభిప్రాయః, ప్రియార్హో ఽ ర్హః, ప్రియకృ, త్ప్రీతివర్ధనః,॥

94. విహాయసగతి, ర్జ్యోతిః, స్సురుచి, ర్హుతభు, గ్విభుః,॥
రవి, ర్విరోచన, స్సూర్య, స్సవితా, రవిలోచనః,॥

95. అనన్తో, హుతభు, గ్భోక్తా, సుఖదో, నైకజో, ఽ గ్రజః,।
అనిర్విణ్ణ, స్సదామర్షీ లోకాధిష్ఠాన, మద్భుతః,॥

96. సనా, త్సనాతనతమః, కపిలః, కపి, రవ్యయః,।
స్వస్తిద, స్స్వస్తికృ, త్స్వస్తి, స్వస్తిభు, క్స్వస్తిదక్షిణః,॥

97. అరౌద్రః, కుండలీ, చక్రీ, విక్ర, మ్యూర్జితశాసనః,।
శబ్దాతిగ, శ్శబ్దసహ,శ్శిశిర, శ్శర్వరీకరః,॥

98. అక్రూరః, పేశలో, దక్షో, దక్షిణః, క్షమిణాంవరః,।
విద్వత్తమో, వీతభయః, పుణ్యశ్రవణకీర్తనః,॥

99. ఉత్తారణో, దుష్కృతిహా, పుణ్యో, దుస్స్వప్ననాశనః,।
వీరహా, రక్షణ, స్సన్తో, జీవనః, పర్యవస్థితః,॥

100. అనన్తరూపో, ఽనన్తశ్రీ, ర్జితమన్యు, ర్భయాపహః,।
చతురశ్రో, గభీరాత్మా, విదిశో, వ్యాదిశో, దిశః,॥

101. అనాది, ర్భూర్భువో, లక్ష్మీ, స్సువీరో, రుచిరాంగదః,।
జననో, జనజన్మాది, ర్భీమో, భీమపరాక్రమః,॥

102. ఆధారనిలయో, ఽ ధాతా, పుష్పహాసః, ప్రజాగరః,।
ఊర్ధ్వగ, స్సత్పథాచారః, ప్రాణదః, ప్రణవః, పణః,॥

103. ప్రమాణం, ప్రాణనిలయః, ప్రాణభృ, త్ప్రాణజీవనః,।
తత్త్వం, తత్త్వవి, దేకాత్మా, జన్మమృత్యుజరాతిగః,॥

104. భూర్భువస్స్వస్తరు, స్తార, స్సవితా, ప్రపితామహః,।
యజ్ఞో, యజ్ఞపతి, ర్యజ్వా, యజ్ఞాంగో యజ్ఞవాహనః,॥

105. యజ్ఞభృ, ద్యజ్ఞకృ, ద్యజ్ఞీ, యజ్ఞభు, గ్యజ్ఞసాధనః,।
యజ్ఞాన్తకృ, ద్యజ్ఞగుహ్య, మన్న, మన్నాద, ఏవచ,॥

106. ఆత్మయోని, స్స్వయంజాతో, వైఖాన, స్సామగాయనః,।
దేవకీనందన, స్స్రష్టా, క్షితీశః, పాపనాశనః,॥

107. శంఖభృ, న్నందకీ, చక్రీ, శార్ఙ్గ ధన్వా, గదాధరః,।
రథాంగపాణి, రక్షోభ్య, స్సర్వప్రహరణాయుధః,॥

శ్రీసర్వప్రహరణాయుధ ఓంనమః ఇతి.

108. వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీచ నందకీ॥
శ్రీమాన్నారాయణో విష్ణు ర్వాసుదేవో ఽ భిరక్షతు॥
శ్రీవాసుదేవో ఽ భిరక్షత్వోన్నమ ఇతి



# ఉత్తరపీఠికా

ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః ।
నామ్నాం సహస్రం దివ్యానామశేషేణ ప్రకీర్తితమ్ ॥ 1

య ఇదం శ్రుణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాశుభం ప్రాప్నుయాత్కిఞ్చిత్సో ఽ ముత్రేహ చ మానవః ॥ 2

వేదాన్తగో బ్రహ్మణ స్స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ ।
వైశ్యో ధనసమృద్ధస్స్యా చ్ఛూద్ర స్సుఖమవాప్నుయాత్ ॥ 3

ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మ మర్థార్థీ చార్థమాప్నుయాత్ ।
కామానవాప్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ప్రజాః॥ 4

భక్తిమా న్య స్సదోత్థాయ శుచిస్తద్గతమానసః।
సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ప్రకీర్తయేత్ ॥ 5

యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్యమేవ చ।
అచలాం శ్రియమాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్ ॥ 6

న భయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విన్దతి ।
భవత్యరోగో ద్యుతిమాన్ బలరూపగుణాన్వితః ॥ 7

రోగార్తో ముచ్యతే రోగా ద్బద్ధో ముచ్యేత బన్ధనాత్ ।
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥ 8

దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్ ।
స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః ॥ 9

వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవపరాయణః ।
సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ ॥ 10

న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్ ।
జన్మమృత్యుజరావ్యాధిభయం (నైవో)నాప్యుపజాయతే ॥ 11

ఇమం స్తవ మధీయాన శ్శ్రద్ధాభక్తిసమన్వితః ।
యుజ్యేతాత్మసుఖక్షాన్తిశ్రీధృతిస్మృతికీర్తిభిః । 12

న క్రోధో న చ మాత్సర్యం న లోభో నాశుభామతిః ।
భవన్తి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే ॥ 13

ద్యౌ స్సచన్ద్రార్కనక్షత్రా ఖం దిశో భూర్మహోదధిః ।
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥ 14

ససురాసురగన్ధర్వం సయక్షోరగరాక్షసమ్ ।
జగద్వశే వర్తతేఽ(దం)దః కృష్ణస్య సచరాచరమ్ ॥ 15

ఇన్ద్రియాణి మనోబుద్ధి స్సత్త్వం తేజో బలం ధృతిః ।
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ ॥ 16

సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పతే ।
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః ॥ 17

ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః।
జఙ్గమాజఙ్గమంచేదం జగన్నారాయణోద్భవమ్ ॥ 18

యోగో జ్ఞానం తథా సాఙ్ఖ్యం విద్యాశ్శిల్పాది కర్మ చ ।
వేదాశ్శాస్త్రాణి విజ్ఞాన మేతత్సర్వం జనార్దనాత్ ॥ 19

ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః ।
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వభుగవ్యయః ॥ 20

ఇమం స్తవం భగవతో విష్ణోర్వ్యాసేన కీర్తితమ్ ।
పఠేద్య ఇచ్ఛేత్పురుష శ్శ్రేయః ప్రాప్తుం సుఖాని చ ॥ 21

విశ్వేశ్వర మజం దేవం జగతః ప్రభవాప్యయమ్ ।
భజన్తి యే పుష్కరాక్షం న తే యాన్తి పరాభవమ్ ॥ 22

నతేయాన్తి పరాభవ ఓంనమ ఇతి

అర్జున ఉవాచ:

పద్మపత్రవిశాలాక్ష! పద్మనాభ! సురోత్తమ!
భక్తానామనురక్తానాం త్రాతా భవ జనార్దన! ॥ 23

శ్రీభగవానువాచ:

యో మాం నామసహస్రేణ స్తోతుమిచ్ఛతి పాణ్డవ!
సోఽహమేకేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః ॥ 24

స్తుతఏవనసంసయ ఓం నమ ఇతి

వ్యాస ఉవాచ:

వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్ ।
సర్వభూతనివాసోఽసి వాసుదేవ! నమోఽస్తు తే ॥ 25

శ్రీవాసుదేవనమోఽస్తుత ఓం నమ ఇతి

పార్వత్యువాచ:

కేనోపాయేన లఘునా విష్ణోర్నామసహస్రకమ్ ।
పఠ్యతే పణ్డితై ర్నిత్యం శ్రోతుమిచ్ఛామ్యహం ప్రభో! ॥ 26



ఈశ్వరఉవాచ:

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామత(త్తు)స్తుల్యం రామనామ వరాననే! ॥ 27

బ్రహ్మోవాచ:

నమోఽ స్త్వనన్తాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షిశిరోరుబాహవే।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటి యుగధారిణే నమః ॥ 28

సఞ్జయఉవాచ:

యత్రయోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధువా నీతి ర్మతి ర్మమ ॥ 29

శ్రీభగవానువాచ:

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ 30

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సమ్భవామి యుగే యుగే ॥ 31

అర్తా విషణ్ణా శ్శిథిలాశ్చ భీతాః
ఘోరేషుచ వ్యాధిషు వర్తమానాః ।
సఙ్కీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్త దుఃఖా స్సుఖినో భవన్తి ॥

య దక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తుతే ॥

ఇతి శ్రీమన్మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం అనుశాసనిక పర్వాన్తర్గత దానధర్మపర్వణి భీష్మయుధిష్ఠిర సంవాదే శ్రీవిష్ణోర్దివ్య సహస్రనామ స్తోత్రం నామైకోనపంచాశ దధిక శతతమోఽ ధ్యాయ:

హరి:ఓం తత్సత్

అపరాధ సహస్రాణి క్రియన్తేఽ హర్నిశం మయా ।
దాసోఽ యమితి మాం మత్వా క్షమస్వ పరమేశ్వర! ॥

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం ।
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ॥
గో బ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం ।
లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు ॥

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోఽ యం క్షోభరహితో బ్రాహ్మణాస్సన్తు నిర్భయాః ॥

అపుత్రాః పుత్రిణ స్సన్తు పుత్రిణస్సన్తు పౌత్రిణః ।
అధనా స్సధనా స్సన్తు జీవన్తు శరదాం శతమ్ ॥

మంగళం కోసలేన్ద్రాయ మహనీయగుణాత్మనే ।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥

నీలాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే ।
సుభద్రా ప్రాణనాథాయ జగన్నాథాయ మంగళమ్ ॥

కాయేన వాచా మనసేన్ద్రియైర్వా ।
బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్ ॥
కరోమి యద్య త్సకలం పరస్మై ।
నారాయణాయేతి సమర్పయామి ॥

సర్వం శ్రీ పరమేశ్వరార్పణ మస్తు
శ్రీరామ రామ రామ
ఓమ్ గురుశ్శరణమ్

# శ్రీలక్ష్మ్యష్టోత్తరశతనామ స్తోత్రమ్

దేవ్యువాచ :-
దేవదేవ! మహదేవ! త్రికాలజ్ఞ! మహేశ్వర! ।
కరుణాకర! దేవేశ! భక్తానుగ్రహకార! ॥
అష్టోత్తరశతం లక్ష్మ్యా శ్శ్రోతుమిచ్ఛామి తత్త్వతః ।

ఈశ్వర ఉవాచ:-
దేవి! సాధు! మహాభాగే! మహాభాగ్య ప్రదాయకమ్ ।
సర్వైశ్వర్యకరం పుణ్యం సర్వపాపప్రణాశనం ॥

సర్వ దారిద్ర్యశమనం శ్రవణాద్భుక్తి ముక్తిదమ్ ।
రాజవశ్యకరం దివ్యం గుహ్యాద్గుహ్యతరం పరమ్ ॥

దుర్లభం సర్వదేవానాం చతుష్షష్టి కళాస్పదమ్ ।
పద్మాదీనాం వరాన్తానాం నిధీనాం నిత్యదాయకమ్ ॥

సమస్తదేవ సంసేవ్య మణిమాద్యష్టసిద్ధిదమ్ ।
కిమత్ర బహునోక్తేన దేవీప్రత్యక్షదాయకమ్ ॥

తవ ప్రీత్యాఽద్య వక్ష్యామి సమాహితమనా శ్శృణు ।
అష్టోత్తరశతస్యాస్య మహాలక్ష్మీస్తుదేవతా ॥



క్లీం బీజపదమిత్యుక్తం శక్తిస్తు భువనేశ్వరీ ।
అఙ్గన్యాసః కరన్యాస స్స ఇత్యాది ప్రకీర్తితః॥

ధ్యానమ్ :-
వన్దే పద్మకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం భాగ్యదాం ।
హస్తాభ్యా మభయప్రదాం మణిగణై ర్నానావిధైర్భూషితామ్ ॥
భక్తాభీష్టఫలప్రదాం హరిహరబ్రహ్మాదిభి స్సేవితాం ।
పార్శ్వే పంకజ శంఖ పద్మ నిధిభి ర్యుక్తాం సదా శక్తిభిః ॥

సరసిజనయనే సరోజహస్తే ధవళతరాంశుక గన్ధమాల్యశోభే ।
భగవతి హరివల్లభే మనోజ్ఞే త్రిభువనభూతికరి ప్రసీద మహ్యమ్ ॥
లమిత్యాది పంచపూజాంవిధాయ

ఓం ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూతహితప్రదామ్ ।
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికామ్ ॥

వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధామ్ ।
ధన్యాం హిరణ్మయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్ ॥

అదితిం చ దితిం దీప్తాం వసుధాం వసుధారిణీమ్।
నమామి కమలాం కాన్తాం కామాక్షీం క్రోధసమ్భవామ్ ॥

అనుగ్రహప్రదాం బుద్ధి మనఘాం హరివల్లభామ్ ।
అశోకా మమృతాం దీప్తాం లోకశోకవినాశినీమ్ ॥

నమామి ధర్మనిలయాం కరుణాం లోకమాతరమ్ ।
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసున్దరీమ్ ॥

పద్మోద్భవాం పద్మముఖీం పద్మనాభప్రియాం రమామ్ ।
పద్మమాలాధరాం దేవీం పద్మినీం పద్మగన్ధినీమ్ ॥

పుణ్యగన్ధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభామ్ ।
నమామి చన్ద్రవదనాం చన్ద్రాం చన్ద్రసహోదరీమ్ ॥

చతుర్భుజాం చన్ద్రరూపా మిన్దిరా మిన్దుశీతలామ్ ।
ఆహ్లాదజననీం పుష్టింశివాం శివకరీం సతీమ్ ॥

విమలాం విశ్వజననీం తుష్టిం దారిద్ర్య నాశినీమ్ ।
ప్రీతిపుష్కరిణీం శాన్తాం శుక్లమాల్యామ్బరాం శ్రియమ్ ॥

భాస్కరీం బిల్వనిలయాం వరారోహాం యశస్వినీమ్ ।
వసున్ధరా ముదారాఙ్గాం హరిణీం హేమమాలినీమ్ ॥

ధనధాన్యకరీం సిద్ధిం స్త్రైణసౌమ్యాం శుభప్రదామ్ ।
నృపవేశ్మగతానన్దాం వరలక్ష్మీం వసుప్రదామ్ ॥

శుభాం హిరణ్య ప్రాకారాం సముద్రతనయాం జయామ్ ।
నమామి మంగళాం దేవీం విష్ణువక్షస్థలస్థితామ్ ॥

విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణసమాశ్రితామ్ ।
దారిద్ర్యధ్వంసినీం దేవీం సర్వోపద్రవవారిణీమ్ ॥

నవ(వన) దుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్ ।
త్రికాలజ్ఞానసమ్పన్నాం నమామి భువనేశ్వరీమ్ ॥

లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూత సమస్తదేవవనితాం లోకైకదీపాంకురామ్ ।
శ్రీమ న్మన్ద కటాక్ష లబ్ధవిభవ బ్రహ్మేన్ద్రగఙ్గాధరాం
త్వాం త్రైలోక్యకుటుమ్బినీం సరసిజాం వన్దే ముకున్దప్రియామ్॥

మాత ర్నమామి కమలే కమలాయతాక్షి
శ్రీ విష్ణుహృత్కమల వాసిని విశ్వమాతః ।
క్షీరోదజే కమలకోమలగర్భ గౌరి
లక్ష్మి ప్రసీద సతతం నమతాం శరణ్యే ॥

త్రికాలం యో జపే ద్విద్వా న్షణ్మాసం విజితేన్ద్రియః ।
దారిద్ర్యధ్వంసనం కృత్వా సర్వ మాప్నో త్యయత్నః ॥

దేవీనామ సహస్రేషు పుణ్యమష్టోత్తరం శతమ్ ।
యేన శ్రియ మవాప్నోతి కోటిజన్మ దరిద్రతః ॥

భృగువారే శతం ధీమా న్పఠే ద్వత్సరమాత్రకమ్।
అష్టైశ్వర్య మవాప్నోతి కుబేర ఇవ భూతలే ।

దారిద్ర్యమోచనం నామ స్తోత్ర మమ్బాపరం శతమ్।
యేన శ్రియ మవాప్నోతి కోటిజన్మ దరిద్రతః॥

భుక్త్వాతు విపులాన్భోగా నస్యా స్సాయుజ్య మాప్నుయాత్।
ప్రాతఃకాలే పఠేన్నిత్యం సర్వదుఃఖోపశాన్తయే ॥

పఠం స్తు చిన్తయే ద్దేవీం సర్వాభరణ భూషితామ్॥

ఇతి శ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్రం సంపూర్ణమ్
శ్రీ పరదేవతా పాదారవిన్దార్పణమస్తు



## ప్రతిపదార్థము

**శ్లో॥ విశ్వం, విష్ణు, ర్వషట్కారో, భూతభవ్య భవత్ప్రభుః,।**
**భూతకృ, ద్భూతభృ, ద్భావో, భూతాత్మా, భూతభావనః,॥** 1

1. విశ్వమ్ = ఈ జగమంతము తన రూపమైనవాడు.
2. విష్ణుః = జగములోపల వెలుపల వ్యాపించియున్నవాడు. (సర్వత్ర వ్యాపించియున్నవాడు.)
3. వషట్కారః = యజ్ఞములందు దేవతల ప్రీతికై చెప్పబడు 'వషట్కార'మను మంత్రస్వరూపుడు.
4. భూతభవ్యభవత్ ప్రభుః = ఇంతకుముందు, ఇప్పుడు, ఇంకముందు ఉండు జీవులకు అధికారి. (త్రికాలములకు ప్రభువు)
5. భూతకృత్ = పంచభూతమయమగు ప్రకృతిని (జీవులను) సృజించువాడు. (సర్వజీవులను సృష్టించువాడు)
6. భూతభృత్ = భూతములను కాపాడువాడు. (సర్వజీవులను కాపాడువాడు)
7. భావః = జగములయొక్క స్థితికి కారణమైనవాడు.
8. భూతాత్మా = భూతములకు చైతన్యస్వరూపమగు ఆత్మయై ఉన్నవాడు. (సర్వజీవులకు ఆత్మయైనవాడు)
9. భూత భావనః = పంచభూతముల రూపమున ఉన్నవాడు.

**శ్లో॥ పూతాత్మా, పరమాత్మా,చ ముక్తానాంపరమాగతిః**
**అవ్యయః, పురుష, స్సాక్షీ, క్షేత్రజ్ఞో,ఽ క్షర, ఏవచ,॥** 2

10. పూతాత్మా = పవిత్రమైన ఆత్మకలవాడు.
11. పరమాత్మా = అన్నింటి కంటె అధికుడైనవాడు.
12. ముక్తానాంపరమాగతిః = జనన మరణాదిసంసారము నుండి బయటపడినవారు ముక్తులు. అట్టివారికి చేరదగినవాడు.
13. అవ్యయః = నాశము, వికారము, వ్యయము(తరుగు) లేనివాడు.
14. పురుషః = 1. పంచభూత ప్రకృతికి అధికారియైనవాడు. 2. శరీరమను పురమున కొలువుండి దానిని నడిపించువాడు.
15. సాక్షీ = సమస్త జగములకు అంతరాత్మయైయుండి, వారు చేయు మంచి, చెడు పనులు వీక్షించువాడు.
16. క్షేత్రజ్ఞః = పంచభూతమగు దేహమునుగూర్చి తెలిసినవాడు.
17. అక్షరః = 1.'అక్షర' స్వరూపుడు -2.నాశము లేనివాడు.

**శ్లో॥ యోగో, యోగవిదాంనేతా, ప్రధాన పురుషేశ్వరః,।**
**నారసింహవపు, శ్రీమాన్, కేశవః, పురుషోత్తమః,॥ 3**

18. యోగః = మనసును ఇంద్రియములను జయించి పరమాత్మను తెలుసుకొను యోగవిద్యయై అలరువాడు.

19. యోగ విదాంనేతా = యోగము తెలిసిన వారికి నాయకుడు.

20. ప్రధాన పురుషేశ్వరః = ప్రకృతికి, మాయకు, జీవులకు ప్రభువు.

21. నారసింహవపుః = భక్తుడైన ప్రహ్లాదుని రక్షింప వచ్చిన నరసింహ రూపుడు.

22. శ్రీమాన్ = లక్ష్మి తనహృదయమునందు ఉన్నవాడు.

23. కేశవః = 'కేశి' అను రాక్షసుని సంహరించినవాడు, మంచి కేశసంపద (వెంట్రుకలు) కలవాడు.

24. పురుషోత్తమః = ఉత్తముడైన పురుషుడు. గుణములచేత గొప్పవాడు.

**శ్లో॥ సర్వ, శ్శర్వ, శ్శివ, స్థాణు, ర్భూతాది, ర్నిధి రవ్యయః,।**
**సంభవో, భావనో, భర్తా, ప్రభవః, ప్రభు, రీశ్వరః,॥ 4**

25. సర్వః = అన్నియు తానై ఉన్నవాడు. సృష్టి, స్థితి, లయలన్నింటికి కారణమైనవాడు.

26. శర్వః = 1.అంతటానిండియుండువాడు. 2.అన్నింటిని కృశింప చేయువాడు.

27. శివః = శుభములనిచ్చువాడు.

28. స్థాణుః = ప్రళయకాలమునందును స్థిరముగానుండువాడు.

29. భూతాదిః = భూతములకు ఆదియైనవాడు-కారణమైనవాడు.

30. అవ్యయ నిధిః = తరగని (ఐశ్వర్యము) సంపద కలవాడు.

31. సంభవః = దుష్టులను శిక్షించుటకు, శిష్టులను రక్షించుటకు, ధర్మమును కాపాడుటకు భూమిపై పలుమార్లు పుట్టుచుండెడువాడు.

32. భావనః = భూతములకు (జీవులకు)వానికర్మలకు తగిన ఫలములనిచ్చువాడు.

33. భర్తా = లోకములను భరించువాడు. పోషించువాడు.

34. ప్రభవః = భూత సంతతిని తనయందు పుట్టింపజేయువాడు. దివ్యమైన జన్మకలవాడు.

35. ప్రభుః = సర్వకర్మములను చేయు సామర్థ్యము కలవాడు.



36. ఈశ్వరః = అసహాయముగ (ఒంటరిగా) ఈ సర్వకార్యములను నిర్వహించువాడు.

**శ్లో॥ స్వయంభూ, శంభు, రాదిత్యః, పుష్కరాక్షో, మహాస్వనః,।**
**అనాదినిధనో, ధాతా, విధాతా, ధాతురుత్తమః,॥ 5**

37. స్వయంభూః = తనంతట తానే పుట్టినవాడు.

38. శంభుః = తలచువారికి శుభములను, సుఖములను కలిగించువాడు.

39. ఆదిత్యః = పన్నెండుమంది సూర్యులయందు ప్రకాశించు (హిరణ్మయస్వరూపుడు) నారాయణుడు.

40. పుష్కరాక్షః = పద్మములవంటి కన్నులు కలవాడు. జ్ఞాననేత్రుడు.

41. మహాస్వనః = వేదరూపమైన గొప్పనాదము కలవాడు. వేదమే శ్వాసగా కలవాడు.

42. అనాది నిధనః = తక్కిన జీవులవలె ఆదియు, అంతము లేనివాడు.

43. ధాతా = విశ్వమును ధరించువాడు, ఆదిశేషుని రూపమున భూమిని మోయువాడు.

44. విధాతా = కర్మలనుచేయించుచు, వానిఫలములను ఇచ్చువాడు.

45. ధాతు రుత్తమః = బ్రహ్మకన్న ఉత్తముడు. (భూమి మొదలగు ధాతువులలో ఉత్తమమైన చిద్రూప ధాతువు అయినవాడు.)

**శ్లో॥ అప్రమేయో, హృషీకేశః, పద్మనాభో, ఉ మరప్రభుః,।**
**విశ్వకర్మా, మను, స్త్వష్టా, స్థవిష్ఠ, స్థవిరో ధ్రువః,॥ 6**

46. అప్రమేయః = ఆ ప్రత్యక్షాదులగు ఏ ప్రమాణములకు అందనివాడు.

47. హృషీకేశః = 1) ఇంద్రియములకు అధిపతి. 2) సూర్య చంద్ర కిరణములు కేశములుగాగలవాడు.

48. పద్మనాభః = బ్రహ్మపుట్టిన కమలము (నాభి) బొడ్డునందు కలవాడు.

49. అమరప్రభుః = దేవతలకు నాయకుడు.

50. విశ్వకర్మా = పంచభూతమయమగు ప్రపంచమును రచించినవాడు.

51. మనుః = మననము చేయునది మంత్రము. ఆ మంత్ర స్వరూపుడు శ్రీహరి.

52. త్వష్టా = ప్రళయకాలమునందు సమస్త భూతములను కృశింపజేసి, నశింపజేయువాడు.

53. స్థవిష్టః = అధికమగు (స్థూల) రూపముగలవాడు.

54. స్థవిరోధ్రువః = సనాతనుడు, శాశ్వతుడు, అయినవాడు.

**శ్లో॥ అగ్రాహ్య శ్శాశ్వతః కృష్ణో,లోహితాక్షః ప్రతర్దనః,।**
**ప్రభూత, స్త్రికకుబ్ధామ, పవిత్రం, మంగళం పరమ్,॥ 7**

55. అగ్రాహ్యః = ఇంద్రియములకు మనస్సుకు, బుద్ధికి అందనివాడు.

56. శాశ్వతః = భూత, వర్తమాన, భవిష్యత్తులందుండువాడు.

57. కృష్ణః = 1) సచ్చిదానంద రూపుడై భక్తుల హృదయములను ఆకర్షించువాడు. 2) మేఘమువలె నల్లనివాడు.

58. లోహితాక్షః = ఎఱ్ఱని కన్నులతో, భక్తులకు జ్ఞానము, దుష్టులకు భయమును కలిగించువాడు.

59. ప్రతర్దన = ప్రళయ కాలమున అన్నింటినినశింపజేయువాడు.

60. ప్రభూతః = జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, శక్తి, తేజములను ఆరు (ఐశ్వర్యములు) ఉత్తమ గుణములు కలవాడు.

61. త్రికకుబ్ధామ = స్వర్గ, భూ, పాతాళలోకములకు మూడింటికి తానే ఆధారమైనవాడు. అందునివసించువాడు.

62. పవిత్రమ్ = తాను పవిత్రుడై, తలచి కొలుచు వారిని పవిత్రులను చేయువాడు.

63. పరమంగళమ్ = స్మరణ మాత్రము చేతనే మిక్కిలి శుభములను భక్తులకు ఇచ్చువాడు.

**శ్లో॥ ఈశానః, ప్రాణదః, ప్రాణో, జ్యేష్ఠ, శ్రేష్ఠః, ప్రజాపతిః,।**
**హిరణ్యగర్భో, భూగర్భో, మాధవో, మధుసూదనః,॥ 8**

64. ఈశానః = జగములకు అధిపతియై సమస్తమును శాసించువాడు.

65. ప్రాణదః = వాయురూపమున జీవులకు ప్రాణశక్తినిచ్చువాడు.

66. ప్రాణః = ప్రాణమై జీవులను నడిపించువాడు.

67. జ్యేష్ఠః = సృష్టికి పూర్వమునందే ఉన్నవాడు.

68. శ్రేష్ఠః = గొప్పవాడు. ప్రశంసింపదగినవాడు.

69. ప్రజాపతిః = జీవులందరికి (పతియై) ప్రభువై రక్షించువాడు.

70. హిరణ్యగర్భః = బ్రహ్మకు ఆత్మయైనవాడు. ఆతనిచే సృష్టి చేయించువాడు



71. భూగర్భః = భూమి తన గర్భమునందు కలవాడు. రక్షించువాడు.

72. మాధవః = మా=లక్ష్మికి, ధవ:భర్తయైనవాడు. లక్ష్మీపతి.

73. మధుసూదనః = "మధుడు" అను రాక్షసుని సంహరించినవాడు.

**శ్లో॥ ఈశ్వరో, విక్రమీ, ధన్వీ, మేధావీ, విక్రమః, క్రమః,।**
**అనుత్తమో, దురాధర్షః, కృతజ్ఞః, కృతి, రాత్మవాన్,॥ 9**

74. ఈశ్వరః = ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తి సంపదలు కలవాడు.

75. విక్రమీ = శౌర్యము ధైర్యము కలవాడు.

76. ధన్వీ = "శార్ఙ్గము"అను ధనువును ధరించినవాడు.

77. మేధావీ = లోకములందలి అన్ని విషయములను గ్రహించు తెలివిగలవాడు.

78. విక్రమః = గరుడునిపైనెక్కి విహరించువాడు.

79. క్రమః = నియమము ప్రకారము నడచువాడు.

80 అనుత్తమః = తనకంటె అధికుడులేనివాడు. అనగా,సర్వోన్నతుడు.

81. దురాధర్షః = ఎవ్వరును ఎదురు నిలిచి గెలుచుటకు వీలులేనివాడు.

82. కృతజ్ఞః = భక్తులు తనకు చేయు సేవను, (పత్రపుష్పాదులను) మరువక సద్గతినిచ్చువాడు.

83. కృతిః = ప్రేరేపించువాడు. కర్మఫలములనందించువాడు.

84. ఆత్మవాన్ = 1.తన శక్తి పైననే ఆధారపడినవాడు. 2.సర్వతంత్ర స్వతంత్రుడు.

**శ్లో॥ సురేశ, శ్శరణం, శర్మ, విశ్వరేతాః, ప్రజాభవః,।**
**అహః, స్సంవత్సరో, వ్యాళః, ప్రత్యయ, స్సర్వదర్శనః,॥ 10**

85. సురేశః = దేవతలకు ప్రభువైనవాడు. రక్షకుడు.

86. శరణం = కష్టములను తొలగించి, కోర్కెలను దీర్చి కాపాడువాడు.

87. శర్మ = ఆనంద స్వరూపుడై, ఆశ్రితులకు ఆనందము నిచ్చువాడు.

88. విశ్వరేతాః = ప్రపంచమునకుబీజమై, సృష్టికి హేతువఅయినవాడు.

89. ప్రజాభవః = జీవుల పుట్టుకకు హేతువు అయినవాడు.

90. అహః = పగటివలె స్వయముగా ప్రకాశించువాడు.

91. సంవత్సరః = కాలస్వరూపుడైనవాడు. (యజ్ఞస్వరూపుడు.)

92. వ్యాళః = 1.పామువలె పట్టుబడనివాడు. (కుండలినీ స్వరూపుడు.) 2.పగబట్టి దుష్టులగు రాక్షసులను వెంటబడి పట్టుకొని సంహరించువాడు.

93. ప్రత్యయః = ప్రజ్ఞాస్వరూపుడు.(వస్తు, విషయముల కంటె భిన్నమైన చైతన్యము ప్రజ్ఞ.)

94. సర్వదర్శనః = 1.సహస్రాక్షుడై సమస్తమును దర్శించువాడు. 2.జీవులందఱిలో చూచుశక్తి తనదైనవాడు.

**శ్లో॥ అజ, స్సర్వేశ్వర, స్సిద్ధ, స్సిద్ధి, స్సర్వాది, రచ్యుతః,।**
**వృషాకపి, రమేయాత్మా, సర్వయోగవినిస్సృతః,॥ 11**

95. అజః = జననమే(పుట్టుక) లేనివాడు.

96. సర్వేశ్వరః = అందరికిని (ప్రభువు)ఈశ్వరుడైనవాడు. (పరిపూర్ణుడు.)

97. సిద్ధః = సర్వము పొందినవాడు. (సిద్ధ పురుషుడు.)

98. సిద్ధిః = జీవులు పొందదగిన ఫలమును తానైనవాడు.

99. సర్వాదిః = సకలమునకు మూలమై, ఆధారమైనవాడు.

100. అచ్యుతః = 1) నాశనములేనివాడు. 2) మాయలో పడనివాడు.

101. వృషాకపిః = భూమిని, ధర్మమును వరాహ రూపమున ఉద్ధరించినవాడు.

102. అమేయాత్మ = అపరిమితము, అనంతమును అయిన రూపము కలవాడు.

103. సర్వయోగవినిస్సృతః= అన్ని విధములైన బంధములనుండి విడివడినవాడు. (సాధనలన్నింటికి అతీతుడు.)

**శ్లో॥ వసు, ర్వసుమనా, స్సత్య, స్సమాత్మా, ఉ సమ్మిత, స్సమః,।**
**అమోఘః, పుండరీకాక్షో, వృషకర్మా, వృషాకృతిః,॥ 12**

104. వసుః = సకల సృష్టి తనయందు కలవాడు. (సృష్టియంతట వసించువాడు.)

105. వసుమనాః = రాగద్వేషాదులులేని నిర్మలమైన మనస్సు కలవాడు.

106. సత్యః = సత్య స్వరూపుడు. అన్నికాలములయందు స్థిరముగా ఉండువాడు.

107. సమాత్మా = ప్రాణులన్నిటియందు సమముగా వర్తించువాడు.

108. సమ్మితః = వికారములులేక సాధకులందరికి తనవాడుగా తోచువాడు.

109. సమః = అందరిని సమానముగాచూచువాడు. లక్ష్మీతో కూడినవాడు.



110. అమోఘః = సత్యమైన సంకల్పములు కలవాడు. (సత్ఫలములనిచ్చువాడు.)

111. పుండరీకాక్షః = పద్మముల వంటి కన్నులు గలవాడు. (హృదయ పద్మము నందుండువాడు.)

112. వృషకర్మా = ధర్మమును నిలబెట్టు పనులు చేయువాడు.

113. వృషాకృతిః = ధర్మస్వరూపుడై, తాను ధర్మమును ఆచరించి, ఇతరులచే ఆచరింప జేయువాడు.

**శ్లో॥ రుద్రో, బహుశిరా, బభ్రు, ర్విశ్వయోని, శ్శుచిశ్రవాః,।**
**అమృత, శ్శాశ్వతస్థాణు, వరారోహో, మహాతపాః,॥ 13**

114. రుద్రః = 1.దు:ఖములను పోగొట్టువాడు. 2.జీవులు చనిపోవునప్పుడు భయముతో దు:ఖింప జేయువాడు.

115. బహుశిరాః = సృష్టిఅంతయు తానైనవాడగుటచే అనేక శిరములు గలవాడు.

116. బభ్రుః = లోకములన్నింటిని భరించువాడు.

117. విశ్వయోనిః = విశ్వనిర్మాణమునకు కారణమైనవాడు.

118. శుచిశ్రవాః = మంగళకరమై, వినదగిన నామములు కలవాడు. (భక్తుల మొఱలువిను మంచి చెవులు కలవాడు.)

119. అమృతః = ముసలితనము, మరణములేనివాడు.

120. శాశ్వతస్థాణుః = సనాతనుడై, నిశ్చలుడైనవాడు.
శాశ్వతస్థాణుః = (శాశ్వతః= నిత్యుడు. స్థాణుః=పరితాపములేని నిశ్చలుడు.)

121. వరారోహః = జ్ఞానగమ్యుడై, ముక్తినిచ్చువాడు. (వైకుంఠధాముడు.)

122. మహాతపాః = సృష్టి మొ॥లగు అన్నివిషయములందు పరిపూర్ణమైన జ్ఞానము కలవాడు.

**శ్లో॥ సర్వగ, స్సర్వవిద్భాను, విష్వక్సేనో, జనార్దనః,।**
**వేదో, వేదవి, దవ్యంగో, వేదాంగో, వేదవి, త్కవిః,॥ 14**

123. సర్వగః = 1.రక్షకుడై విశ్వమునందంతట సంచరించుచున్నవాడు.

124. సర్వవిద్భానుః = అన్నియు తెలిసి, సూర్యునివలె ప్రకాశించువాడు. (అన్నింటిని ప్రకాశింప జేయువాడు.)

125. విష్వక్సేనః = సేనాపతి. యుద్ధమున ప్రవేశించిన మాత్రముచేతనే శత్రువులను దూరముగ పారద్రోలువాడు.

126. జనార్దనః = దుర్జనులను శిక్షించువాడు. సజ్జనులను రక్షించి ఆనందమునిచ్చువాడు.

127. వేదః = జ్ఞానజ్యోతియై, ధర్మమును బోధించు వేదమే, తన రూపమైనవాడు.

128. వేదవిత్ = వేద విజ్ఞానము అనుభవమునందు కలవాడు.

129. అవ్యంగః = జ్ఞానియై, లోకమునకు వ్యక్తము కానివాడు.

130. వేదాంగః = వేదములే శరీరభాగములుగా కలవాడు.

131. వేదవిత్ = వేదార్థమును విచారించి, వివరించువాడు.

132. కవిః = నిశిత పరిశీలనముతో అన్నింటిని దర్శించి చెప్పువాడు.

**శ్లో॥ లోకాధ్యక్ష, స్సురాధ్యక్షో, ధర్మాధ్యక్షః, కృతాకృతః,।**
**చతురాత్మా, చతుర్వ్యూహ, శ్చతుర్దంష్ట్ర, శ్చతుర్భుజః,॥ 15**

133. లోకాధ్యక్షః = 1) సాక్షియై లోకములనుచూచువాడు.
2) ప్రభువై నియంత్రించువాడు.

134. సురాధ్యక్షః = ఇంద్రాది దేవతలకు నాయకుడై వారిని విధులందు నియమించువాడు.

135. ధర్మాధ్యక్షః = ధర్మమునకు అధికారియై, ఆచరించువారికి మంచి ఫలమునిచ్చువాడు.

136. కృతాకృతః = కనబడుచున్న కార్యము, (విశ్వము), కనబడని కారణమును అయినవాడు.

137. చతురాత్మా = సృష్టి, స్థితి, లయములతో బాటు దానికి కారణమైన తురీయావస్థయు తానైనవాడు.

138. చతుర్వ్యూహః = వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ తత్త్వములుగ అవతరించి లోకములను నడుపువాడు.

139. చతుర్దంష్ట్రః = నాలుగు కోరలు గల నరసింహుడైనవాడు. ఐరావతముగాను ఉన్నవాడు.

140. చతుర్భుజః = శంఖ, చక్ర, గదా, పద్మములను ధరించు నాలుగు చేతులతో ఆశ్రితులకు ధర్మార్థ, కామ, మోక్షములను నాలుగు పురుషార్థములను ఇచ్చువాడు.



**శ్లో॥ భ్రాజిష్ణు, ర్భోజనం, భోక్తా, సహిష్ణు, ర్జగదాదిజః,।**
**అనఘో, విజయో, జేతా, విశ్వయోనిః, పునర్వసుః,॥ 16**

141. భ్రాజిష్ణుః = స్వయముగా ప్రకాశించువాడు, లోకములను తన శక్తిచే ప్రకాశింపజేయువాడు.

142. భోజనం = అన్న స్వరూపుడై జీవులకు ప్రాణశక్తిని ఇచ్చువాడు.

143. భోక్తా = జీవుని రూపములో అన్నమును భుజించువాడు.

144. సహిష్ణుః = భక్తుల అపరాధములను ప్రేమతో మన్నించువాడు. దుష్టులను శిక్షించువాడు.

145. జగదాదిజః = జగత్తుకు ముందున్నవాడు. సృష్టికర్త బ్రహ్మకు తండ్రి

146. అనఘః = చేసిన పనులవలన పాపము లేనివాడు.

147. విజయః = తనగుణములచే జగమును మిక్కిలి జయించువాడు.

148. జేతా = ఎల్లప్పుడు దేవతలను రక్షించుచు, రాక్షసులను జయించువాడు.

149. విశ్వయోనిః = జగత్పరిణామమునకు కారణమైనవాడు.

150. పునర్వసుః = జీవునిరూపమున సకలదేహములయందుండువాడు.

**శ్లో॥ ఉపేంద్రో, వామనః, ప్రాంశు, రమోఘ, శ్శుచి, రూర్జితః,।**
**అతీంద్ర, స్సంగ్రహ, స్సర్గో, ధృతాత్మా, నియమో, యమః,॥ 17**

151. ఉపేంద్రః = (దేవతలను రక్షించుటకై) అదితి గర్భమున ఇంద్రునకు తమ్ముడై పుట్టినవాడు. వామనుడు.

152. వామనః = పొట్టివాడై పుట్టి, ముల్లోకములను ఆక్రమించిన బలిని, మూడు అడుగుల నేల అడిగినవాడు.

153. ప్రాంశుః = ఉన్నతమైన శరీరముగల త్రివిక్రముడై మూడు లోకముల నాక్రమించినవాడు.

154. అమోఘః = వ్యర్థముకాని, చెడని పనులు చేయువాడు.

155. శుచిః = తాను పవిత్రుడై, తనను తలచి కొలచువారిని పవిత్రులను చేయువాడు.

156. ఊర్జితః = గొప్ప బలము కలవాడు.

157. అతీంద్రః = (1) జ్ఞానము సంపద మొ॥ వానియందు ఇంద్రుని కంటె గొప్పవాడు. (2) ఇంద్రియములను నడుపువాడు.

158. సంగ్రహః = ప్రళయ కాలమున సర్వమును తనయందు లయము చేసుకొనువాడు.

159. సర్గః = సృష్టియు, సృష్టికి కారణమైనవాడు. (విశ్వరూపుడు, విశ్వమును సృజించువాడు విష్ణువే)

160. ధృతాత్మా = తాను జననమరణాది వికారములులేనివాడు. అందఱి ఆత్మలు తనయందు లగ్నము చేయబడినవాడు.

161. నియమః = చరాచర జగత్తును, జీవులను వారి వారి పనులందు ప్రవర్తింపజేయువాడు.

162. యమః = జీవులందరియందుండి ముందుకు నడిపించువాడు.

శ్లో॥ వేద్యో, వైద్య, స్సదాయోగీ, వీరహా, మాధవో, మధుః,।
అతీంద్రియో, మహామాయో, మహోత్సాహో, మహాబలః,॥ 18

163. వేద్యః = తన నడవడి ద్వారా అందరికిని తెలియదగినవాడు.

164. వైద్యః = అన్ని విద్యలు తానై, తనను తెలిసికొను శక్తి, యుక్తులు భక్తులకు ఇచ్చువాడు.

165. సదాయోగి = ఎల్లప్పుడు తనను, తాను తెలుసుకొను యోగమున జాగరూకుడై ఉండి భక్తులకు బోధించువాడు.

166. వీరహా = ధర్మరక్షణ కొఱకు దుష్టులగు వీరులను (అసురులను)సంహరించువాడు.

167. మాధవః = బ్రహ్మవిద్యకు అధిపతియై, అర్హులకు ఆత్మజ్ఞానమును ఇచ్చువాడు.

168. మధుః = జ్ఞానులకు అమృత స్వరూపమగు తన దివ్యచరిత్ర ద్వారా ఆనందమునిచ్చువాడు.

169. అతీంద్రియః = సుఖ కారణములగు ఇంద్రియములకు అందనివాడు.

170. మహామాయః = మనోబుద్ధులకు గోచరముకాని మాయాస్వరూపుడు.

171. మహోత్సాహః = సృష్టి, స్థితి లయములందు, భక్తులను రక్షించుట యందు మిక్కిలి ఉత్సాహము కలవాడు.

172. మహాబలః = దేహేంద్రియ మనో బుద్ధులకు బలమునిచ్చుచు, బలవంతుల కంటె మిక్కిలి బలవంతుడైనవాడు.



శ్లో॥ మహాబుద్ధి, ర్మహావీర్యో, మహాశక్తి, ర్మహాద్యుతిః,।
అనిర్దేశ్యవపు, శ్రీమా, నమేయాత్మా, మహాద్రిధృక్,॥ 19

173. మహాబుద్ధిః = 1. ప్రజ్ఞాన స్వరూపుడు. 2. బుద్ధిమంతులకెల్ల బుద్ధిమంతుడు.

174. మహావీర్యః = సృష్టి, స్థితి, లయములను చేయు సామర్థ్యము గలవాడు.

175. మహాశక్తిః = ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు కలిగి యుండువాడు.

176. మహాద్యుతిః = 1. గొప్ప ప్రకాశము గలవాడు. 2. వెలుగులకు వెలుగు.

177. అనిర్దేశ్యవపుః = ఇట్లుండునని చెప్పుటకు వీలులేని శరీరముకలవాడు. అన్నిరూపములు తన రూపమైనవాడు

178. శ్రీమాన్ = తరగని సంపద కలవాడు. శుభములనిచ్చువాడు, మంగళస్వరూపుడు. లక్ష్మీపతి.

179. అమేయాత్మా = ఊహకందని మేధాసంపదగలవాడు.

180. మహాద్రిధృక్ = ఆశ్రితులను రక్షించుటకు మందర, గోవర్ధన పర్వతములను పైకెత్తి పట్టినవాడు.

శ్లో॥ మహేష్వాసో, మహీభర్తా, శ్రీనివాస, స్సతాంగతిః,।
అనిరుద్ధ, స్సురానందో, గోవిందో, గోవిదాంపతిః,॥ 20

181. మహేష్వాసః = గొప్పధనువు (శార్ఙ్గము) నుధరించువాడు.

182. మహీభర్తా = భూమిని భరించువాడు, రక్షించువాడు.

183. శ్రీనివాసః = శ్రీ మహాలక్ష్మికి నిత్య నివాసస్థానమైనవాడు.

184. సతాంగతిః = సజ్జనులకు ఆశ్రయమైనవాడు. చేరదగినవాడు. పురుషార్థములను ప్రసాదించువాడు.

185. అనిరుద్ధః = ఇతరులచే అడ్డగింపబడనివాడు.

186. సురానందః = దేవతలకు రక్షణముచేకూర్చి,ఆనందమునుఇచ్చువాడు.

187. గోవిందః = 1. గోవులను (భూమిని) రక్షించువాడు. 2. వేదాంతవాక్యములద్వారా తెలియదగినవాడు.

188. గోవిదాంపతిః = భావములను ప్రకటించునది వాక్కు..(వేదము) ఆ వాక్కులను తెలిసినవారికి ప్రభువు.

శ్లో॥ మరీచి, ర్దమనో, హంస, స్సుపర్ణో, భుజగోత్తమః,।
హిరణ్యనాభ, స్సుతపాః, పద్మనాభః ప్రజాపతిః,॥ 21

189. మరీచిః = తేజోవంతులకెల్ల తేజోవంతుడై ప్రకాశమునిచ్చువాడు.

190. దమనః = కర్తవ్యము (బాధ్యత)ను విడుచువారిని శిక్షించువాడు.

191. హంసః = జీవులందరిలోను ప్రాణస్వరూపుడై సాక్షిగా ఉండువాడు.

192. సుపర్ణః = 1. కర్మ, జ్ఞానములనెడి సుందరములు, శుభకరములైన రెక్కలువాడు.
2. గరుత్మంతుని రూపమున ఉన్నవాడు.

193. భుజగోత్తమః = సర్పములలో గొప్పవాడైన వాసుకి, నాగులలో గొప్పవాడైన (అనంతుడు)ఆదిశేషుడు అయినవాడు.

194. హిరణ్యగర్భః = బ్రహ్మకు జన్మనిచ్చిన బంగారు బొడ్డు కలవాడు.

195. సుతపాః = నరనారాయణ రూపమున, బదరికాశ్రమునందు చక్కని తపమాచరించువాడు.

196. పద్మనాభః = జీవుల హృదయపద్మమున (నాభి స్థానమున) మధ్యభాగమున భాసించువాడు.

197. ప్రజాపతిః = జీవ సమూహము పుట్టుకకు కారణము, అధిపతి(ప్రభువు)యైనవాడు.

**శ్లో॥ అమృత్యు, స్సర్వదృ, క్సింహ, స్సంధాతా, సంధిమాన్, స్థిరః,।**
**అజో, దుర్మర్షణ, శ్శాస్తా, విశ్రుతాత్మా, సురారిహా,॥ 22**

198. అమృత్యుః = మరణము, మరణ కారణము లేనివాడు.

199. సర్వదృక్ = జగచ్చక్షువు, కర్మసాక్షియై అన్నింటిని చూచువాడు.

200. సింహః = అధర్మపరులను, దుష్టులను దండించి, హింసించువాడు.

201. సంధాతా = జీవులకు వారి (పుణ్య+అపుణ్య) ఫలములను సమకూర్చువాడు.

202. సంధిమాన్ = కర్మఫలమువనుభవించు భక్తుని రూపమున ఉన్నవాడు.

203. స్థిరః = ఏ వికారములు లేక, సదా భక్తులను అనుగ్రహించువాడు.

204. అజః = పుట్టుకలేనివాడు. అట్టివానికి మరణమును లేదు.



205. దుర్మర్షణః = 1) దుష్టులకు భయంకరుడైనవాడు. 2) భక్తులను కరుణించునట్టి ప్రసన్న రూపమున నుండువాడు.

206. శాస్తా = శ్రుతి, స్మృతులమూలమున లోకములను శాసించువాడు. హితమును చేకూర్చువాడు.

207. విశ్రుతాత్మా = ఆత్మ విచారము ద్వారా మిక్కిలి శ్రవణము చేయబడినవాడు.

208. సురారిహా = 1. దేవతలకు శత్రువులైన రాక్షసులను సంహరించువాడు.

**శ్లో॥ గురు, ర్గురుతమో, ధామ, స్సత్య, స్సత్యపరాక్రమః,।**
**నిమిషో, ఽనిమిష, స్స్రగ్వీ, వాచస్పతి, రుదారధీః,। 23**

209. గురుః = ఆత్మ జ్ఞానమును బోధించు గురు స్వరూపుడు.

210. గురుతమః = గురువుకెల్ల గురువు అయినవాడు.

211. ధామః = ముక్తులుచేరు పరమధామమైన వైకుంఠుడు.

212. సత్యః = త్రికాలాభాధ్యమగు సత్యమేస్వరూపముగాకలవాడు.

213. సత్యపరాక్రమః = సత్యమును నిరూపించుటకు తగిన గొప్పపరాక్రమము కలవాడు. సత్యమే ఆయుధముగా కలవాడు.

214. నిమిషః = కనులుమూసిన యోగనిద్ర(సమాధి)లోనుండువాడు.

215. అనిమిషః = యోగనిద్రలో ఉండియు జాగరూకుడై మాయని కనులు కలవాడు.

216. స్రగ్వీ = "వైజయంతి"అను వాడనిపూలమాల ధరించువాడు.

217. వాచస్పతిరుదారధీః = విద్యా, విజ్ఞానములకు (అధిపతి)నిలయమైనవాడు.

**శ్లో॥ అగ్రణీ, గ్రామణీ, శ్శ్రీమా, న్న్యాయో, నేతా, సమీరణః,।**
**సహస్రమూర్ధా, విశ్వాత్మా, సహస్రాక్ష, స్సహస్రపాత్,॥ 24**

218. అగ్రణీః = ఉత్తమ గతికి, ఉన్నత మార్గమును చూపువాడు.

219. గ్రామణీః = సకల భూతములను నడిపించు నాయకుడు.

220. శ్రీమాన్ = జ్ఞాన, తేజో, సంపదలచే ప్రకాశించువాడు. (శ్రీ = కాంతి)

221. న్యాయః = సత్యమును నిరూపించు (తర్క) న్యాయశాస్త్ర స్వరూపుడు.

222. నేతా = 'జగత్తు' అనెడి ఈ యంత్రమును నడుపువాడు.

223. సమీరణః = వాయు రూపమున సకలజీవులనుకదలించువాడు.

224. సహస్రమూర్ధా = జీవులందఱి రూపమున నున్న భగవంతుడు, వేనవేల శిరములు గలవాడు.
225. విశ్వాత్మా = ఆత్మస్వరూపుడై విశ్వమంతయు నిండి యుండువాడు.
226. సహస్రాక్షః = అందరి నేత్రములకు చైత్యమును గూర్చువాడు. సాక్షి
227. సహస్రపాత్ = వేనవేలు పాదములు కలవాడు. అంతటా సంచరించువాడు.

శ్లో॥ ఆవర్తనో, నివృత్తాత్మా, సంవృత, స్సంప్రమర్దనః,।
అహస్సంవర్తకో, వహ్ని, రనిలో, ధరణీధరః,॥ 25

228. ఆవర్తనః = సంసార (లోక) చక్రమును త్రిప్పువాడు.
229. నివృత్తాత్మా = సంసారబంధములలో చిక్కక త్రిగుణాతీతమగు సచ్చిదానంద రూపముననుండువాడు.
230. సంవృతః = అవిద్యచే కప్పబడిన జీవుడుగా నున్నవాడు.
231. సంప్రమర్దనః = అజ్ఞానులై అహంకరించిన వారిని యమ, రుద్రుల ద్వారా అణచివేయువాడు.
232. అహః సంవర్తకః = సూర్యుని రూపమున లోకమునకు పగటిని కల్పించువాడు. కర్తవ్యమును పాటింపజేయువాడు.
233. వహ్నిః = యజ్ఞములందు, అందించు హవిస్సును దేవతలకు చేర్చువాడు. అగ్ని స్వరూపుడు.
234. అనిలః = 1. ప్రాణులలో, ప్రకృతిలో ప్రాణవాయు రూపమున నుండువాడు. 2. ఇదినెలవని చెప్పుటకు వీలు లేక, ఒక చోటనే కాక అంతటా ఉండువాడు.
235. ధరణీధరః = భూమిని భ(ధ)రించు వరాహము, ఆదిశేషుడు మఱియు దిగ్గజముల రూపమైనవాడు.

శ్లో॥ సుప్రసాదః, ప్రసన్నాత్మా, విశ్వధృ, గ్విశ్వభు, గ్విభుః,।
సత్కర్తా, సత్కృత, స్సాధు, ర్జహ్ను, ర్నారాయణో, నరః,॥ 26

236. సుప్రసాదః = ద్వేషించు వారిపైనను మిక్కిలి అనుగ్రహము కలవాడు.
237. ప్రసన్నాత్మా = నిర్మలమైన హృదయము కలవాడు.
238. విశ్వధృక్ = విశ్వమును నేర్పుతో ధరించువాడు.
239. విశ్వభుక్ = విశ్వమును (భక్షించుచు) జీవుడై అనుభవించువాడు



240. విభుః = విశ్వమునందు అంతట, అన్నియు తానైయున్నవాడు.
241. సత్కర్తా = సజ్జనులను సత్కరించువాడు.
242. సత్కృతః = మంచివారిచే (పూజాదులచే) సత్కరింపబడువాడు.
243. సాధుః = మంచి ప్రవర్తన కలవాడు.
244. జహ్నుః = 1) అజ్ఞానులను సంసారమున పడవేయువాడు.
2) భక్తులను ముక్తిపదమునకు నడిపించువాడు.
245. నారాయణః = 1.నీరు స్థానముగా కలవాడు. 2.నరులకు ఆశ్రయమైనవాడు.
246. నరః = ఆశ్రయించిన జీవులను ఉత్తమగతికి నడుపువాడు.

శ్లో॥ అసంఖ్యేయో, ఽ ప్రమేయాత్మా, విశిష్టః, శ్శిష్టకృ, చ్ఛుచిః,।
సిద్ధార్థ, స్సిద్ధసంకల్పః, స్సిద్ధిద, స్సిద్ధిసాధనః,॥ 27

247. అసంఖ్యేయః = అనేకములైన నామరూపాదులు కలవాడు.
248. అప్రమేయాత్మా = లెక్కించుటకు వీలుకాని స్వరూపాదులు కలవాడు.
249. విశిష్టః = అన్నింటి కంటెను గొప్పవాడు.
250. శిష్టకృత్ = జగములను పాలించి, సజ్జనులను రక్షించుటకు శాసనము చేయువాడు.
251. శుచిః = 1) పవిత్రుడై పరద్రవ్యమును కోరని వాడు.
2) మాయకతీతుడై నిర్మలుడైనవాడు.
253. సిద్ధార్థః = పురుషార్థములన్నింటిని పొందినవాడు.
254. సిద్ధ సంకల్పః = నెఱవేరిన (సంకల్పములు) కోరికలు కలవాడు.
255. సిద్ధిసాధనః = సిద్ధినొసగు సాధనమును తానైఉన్నవాడు.

శ్లో॥ వృషాహీ, వృషభో, విష్ణు ర్వృషపర్వా, వృషోదరః,।
వర్ధనో, వర్ధమానశ్చ, వివిక్త, శ్శ్రుతిసాగరః,॥ 28

256. వృషాహీ = 1. ధర్మము కలవాడు. 2. ఏకాహం, సప్తాహం మొ॥ ధర్మకర్మముల వలన పూజింపబడువాడు.
257. వృషభః = ఆశ్రితులకు తాపత్రయమును తొలగించి, అభీష్టములనిచ్చువాడు.
258. విష్ణుః = విశ్వమంతట వ్యాపించి, సకలసంపదలు కలవాడు.

259. వృషపర్వా = సాధకులకు ధర్మము (వైకుంతము) నకు పోవు చక్కని సోపానములు ఏర్పరచువాడు.

260. వృషోదరః = సృష్టికాలమున జీవులను సృజించు ఉదరము (పొట్ట) కలవాడు.

261. వర్ధనః = 1) జీవులను పోషించువాడు. 2) భక్తుల శ్రేయములను వృద్ధి పొందించువాడు.

262. వర్ధమానః = విశ్వము తానై వివిధ రూపములుగ వృద్ధి పొందువాడు.

263. వివిక్తః = పుణ్యపాపములందు ప్రపంచముతో సంబంధము లేక ప్రత్యేకముగ నుండువాడు.

264. శ్రుతి సాగరః = వేదములకు సముద్రమువంటివాడు.

శ్లో॥ సుభుజో, దుర్ధరో, వాగ్మీ, మహేంద్రో, వసుదో, వసుః,।
నైకరూపో, బృహద్రూపః, శిపివిష్టః, ప్రకాశనః,॥ 29

265. సుభుజః = వరద - అభయ ముద్రలు కలిగి, వివిధ ఆయుధములను ధరించు గొప్ప చేతులు కలవాడు.

266. దుర్ధరః = ఇతరులు ధరింపరాని శక్తి కలవాడు, భూమిని (లోకములను) ధరించువాడు.

267. వాగ్మీ = వేదవిజ్ఞానమును,ధర్మమును చక్కగా ప్రవచించువాడు.

268. మహేంద్రః = ఇంద్రాది దేవతలకు ప్రభువైనవాడు.

269. వసుదః = బంగారము (ధనము) ను ఇచ్చువాడు.

270. వసుః = ఐశ్వర్య (సంపద) స్వరూపుడు.

271. నైకరూపః = పంచభూతాత్మకమై, మత్స్య, కూర్మ, వరాహాది అనేక రూపములు కలవాడు.

272. బృహద్రూపః = బ్రహ్మాండమంతయు తానగుచు గొప్పరూపమున నుండువాడు.

273. శిపివిష్టః = సూర్యకిరణములందలి వేడి (తాపము) తానై యుండువాడు.

274. ప్రకాశః = లోకమున సకలమును ప్రకాశింపజేయువాడు. భక్తులకు దివ్య దర్శనమిచ్చువాడు.

శ్లో॥ ఓజస్తేజోద్యుతిధరః, ప్రకాశాత్మా, ప్రతాపనః,।
బుద్ధ స్స్పష్టాక్షరో, మంత్ర, శ్చంద్రాంశు, ర్భాస్కరద్యుతిః,॥ 30

275. ఓజస్తేజోద్యుతిధరః = జీవులయందు శారీరక, మానసిక బుద్ధి ప్రకాశ వైభవమంతయు తానై యున్నవాడు.



276. ప్రకాశాత్మా = తేజో రాశియై స్వయముగా ప్రకాశించు ఆత్మ కలవాడు.

277. ప్రతాపనః = చంద్ర సూర్యాగ్ని తేజమున ప్రకాశించుచు, జీవులను కాపాడువాడు.

278. బుద్ధః = ధర్మము, జ్ఞానము, వైరాగ్యము సమృద్ధిగాకలవాడు.

279. స్పష్టాక్షరః = స్పష్టమైన అక్షరము (ఓంకారము)చే తెలియబడువాడు.

280. మంత్రః = మననము చేయువారిని కాపాడునది మంత్రము. ఆ దివ్యమంత్రస్వరూపుడు భగవంతుడు.

281. చంద్రాంశుః = తాపత్రయముచే పీడింపబడువానిని చంద్రకిరణముల వంటి చల్లదనముతో పోషించుచు కాపాడువాడు.

282. భాస్కరద్యుతిః = అజ్ఞానాంధకారమును పోగొట్టు సూర్యతేజమై ప్రకాశించువాడు.

శ్లో॥ అమృతాంశూద్భవో, భాను, శ్శశిబిందు, స్సురేశ్వరః,।
ఔషధం, జగతస్సేతు, స్సత్యధర్మపరాక్రమః,॥ 31

283. అమృతాంశూద్భవః= 1. విశ్వరూపుడై చంద్రుని పుట్టుకకు కారణమైనవాడు. 2. మహాకూర్మరూపమున క్షీరసాగరమథనమునకు ఆధారభూతుడై, చంద్రుని పుట్టుటకు కారణమైనవాడు.

284. భానుః = తాను స్వయముగా ప్రకాశించు శక్తిగలవాడై ఇతరములను ప్రకాశింపజేయుచున్నవాడు. సూర్యుడు.

285. శశిబిందుః = చంద్రకాంతియై ఓషధులను, ఆనందమును పెంపొందించువాడు.

286. సురేశ్వరః = దేవతలకు దేవుడైనవాడు. మోక్షప్రదాత.

288. జగతస్సేతుః = సంసారసముద్రమునబడకుండ దాటజేయువారధి (వంతెన) యైనవాడు. ప్రపంచమునకు పరమాత్మకు మధ్యవంతెనవంటివాడు.

289. సత్యధర్మపరాక్రమః = సత్యము, ధర్మము, పరాక్రమము మొదలగు కల్యాణ గుణములు కలిగి, ధర్మరక్షణము చేయువాడు.

శ్లో॥ భూతభవ్యభవన్నాథః, పవనః, పావనో, ఉనలః,।
కామహా, కామకృ, త్కాంతః, కామః, కామప్రదః, ప్రభుః,॥ 32

290. భూతభవ్యభవన్నాథః = మూడుకాలములందును జీవులచే సుఖశాంతులకై ప్రార్థింపబడు ప్రభువు.

291. పవనః = వాయువై సమస్తమును పవిత్రము చేయువాడు.
292. పావనః = వాయువునకు చైతన్యమును గూర్చి సర్వత్ర కదలజేయువాడు. ప్రాణదాత.
293. అనలః = ప్రాణము నిలుపుటకు కారణమైన అగ్నిస్వరూపము తానైనవాడు.
294. కామహా = తామసముగల కోరికలను నశింపజేయువాడు.
295. కామకృత్ = సాత్వికములగు సంకల్పములను నెఱవేర్చువాడు.
296. కాంతః = కల్యాణగుణములతో సుందరుడై మనోహర రూపముగలవాడు.
297. కామః = శుభలక్షణములతో అందరిచే కోరబడువాడు.
298. కామప్రదః = భక్తులు కోర్కెలను తీర్చువాడు.
299. ప్రభుః = అన్ని విధముల ఉన్నతుడు. ఉత్తముడు.

**శ్లో॥ యుగాదికృ, ద్యుగావర్తో, నైకమాయో, మహాశనః,।**
**అదృశ్యో, వ్యక్తరూపశ్చ, సహస్రజి, దనంతజిత్,॥ 33**

300. యుగాదికృత్ = ఆదిదేవుడై, కృత, త్రేతా, ద్వాపర కలినామములతో 4 యుగములను కల్పించినవాడు.
301. యుగావర్తః = ఆ, యా, ధర్మములతో యుగచక్రము త్రిప్పువాడు.
302. నైకమాయః = మాయతో అనేక రూపములను ధరించి, ధర్మరక్షణ చేయువాడు.
303. మహాశనః = కల్పాంతమందు అన్నింటిని కబళించువాడు.
304. అదృశ్యః = ఇంద్రియ, మనో, బుద్ధులకు కనబడనివాడు.
305. వ్యక్తరూపః = 1. భక్తుల (యోగుల) హృదయములందు ధ్యానముచే తెలియబడువాడు. 2. ధృవ, ప్రహ్లాదాది భక్తులకు దర్శనమిచ్చినవాడు.
306. సహస్రజిత్ = చెలరేగు వేలకొలది రాక్షసులను (కామాదులను) జయించువాడు.
307. అనంతజిత్ = అధికమగుశక్తిచే అందఱిని జయించువాడు.

**శ్లో॥ ఇష్టో, విశిష్ట, శ్శిష్టేష్ట, శ్శిఖండీ, నహుషో, వృషః,।**
**క్రోధహా, క్రోధకృత్కర్తా, విశ్వబాహు, ర్మహీధరః,॥ 34**

308. ఇష్టః = ఆనందస్వరూపుడై అందరిచేత కోరబడువాడు.
309. అవశిష్టః = అందఱి హృదయములందు కొలువుండువాడు.



310. శిష్టేష్టః = మంచినడవడిగలవారిని ప్రేమించువాడు. వారిచే ప్రేమింపబడువాడు.
311. శిఖండీ = నెమలి పింఛము ధరించువాడు. (కృష్ణుడు).
312. నహుషః = మాయచే జీవులను సంసారమున బంధించువాడు.
313. వృషః = పురుషార్థములనిచ్చు ధర్మస్వరూపుడు.
314. క్రోధహా = భక్తులలోని క్రోధమును నశింపచేయువాడు.
315. క్రోధకృత్కర్తా = దుష్టాత్ములకు క్రోధమును కలిగించి, వారిని నశింప చేయువాడు.
316. విశ్వబాహుః = దుష్టులను శిక్షించి, సాధువులను రక్షించుటకు విశ్వమందంతట బాహువులు (చేతులు) కలవాడు.
317. మహీధరః = భూభారమును భరించువాడై భక్తుల పూజలందుకొనువాడు.

**శ్లో॥ అచ్యుతః, ప్రథితః, ప్రాణః, ప్రాణదో, వాసవానుజః,।**
**అపాంనిధి, రధిష్ఠాన, మప్రమత్తః, ప్రతిష్ఠితః,॥ 35**

318. అచ్యుతః = మాయకు లోబడనివాడు. నాశనములేనివాడు
319. ప్రథితః = సృష్టి, స్థితి, లయములచే మిక్కిలి ప్రసిద్ధుడైనవాడు.
320. ప్రాణః = సకల జీవులయందు ప్రాణశక్తియైయుండువాడు.
321. ప్రాణదః = జీవులకు ప్రాణశక్తినిచ్చువాడు. త్రుంచువాడు కూడ.
322. వాసవానుజః = అదితి కశ్యపులకు ఇంద్రుని తమ్మునిగా అవతరించినవాడు. వామనుడు. అతడే త్రివిక్రముడు.
323. అపాంనిధిః = నీటికి స్థానమైన సముద్రమైనవాడు. అనంత శక్తియుతుడు.
324. అధిష్ఠానమ్ = జగములన్నింటికి ఆధారమైనవాడు.
325. అప్రమత్తః = జీవులకు కర్మఫలమునిచ్చుటలో ఏమఱుపాటు లేనివాడు.
326. ప్రతిష్ఠితః = తన మహిమయందే తాను ఆధారపడి యుండువాడు. (సర్వతంత్రస్వతంత్రుడు).

**శ్లో॥ స్కంద, స్స్కందధరో, ధుర్యో, వరదో, వాయువాహనః,।**
**వాసుదేవో, బృహద్భాను, రాదిదేవః, పురందరః,॥ 36**

327. స్కందః = అమృతస్వరూపమున ప్రవహించువాడు. దేవ సేనానియగు కుమారస్వామిగానున్నవాడు.

328. స్కందధరః = లోకములను ధర్మమార్గమున నిలుపువాడు. కుమారస్వామిని నిలుపువాడు.
329. ధుర్యః = జీవుల జన్మము మొదలగువాని భారమును మోయువాడు. ఆశ్రిత రక్షకుడు.
330. వరదః = వరములనిచ్చువాడు.
331. వాయువాహనః = భూమినుండి ధ్రువనక్షత్రము వఱకు వ్యాపించి ఉన్న సప్త(7)మారుతములను ప్రవర్తింపజేయువాడు.
332. వాసుదేవః = మూడులోకములందు, భూతములన్నింటియందును నిండి ప్రకాశించుచుందువాడు. సర్వము తనయందు కలవాడు.
333. బృహద్భానుః = సూర్య, చంద్ర, నక్షత్రములకు వెలుగై ప్రకాశించువాడు.
334. ఆదిదేవః = సృష్టికర్తయైన బ్రహ్మకు కారణమైనవాడు. తొలివేల్పు.
335. పురందరః = 1. మహేశ్వరుడుగా, రాక్షసుల త్రిపురములను నాశముచేసినవాడు. 2. స్థూల,సూక్ష్మ, కారణ శరీరములను నశింపజేసి మోక్షమునిచ్చువాడు.

**శ్లో॥ అశోక, స్తారణ, స్తార, శ్శూర, శ్శౌరి, ర్జనేశ్వరః,।**
**అనుకూల, శ్శతావర్తః, పద్మీ పద్మనిభేక్షణః,॥ 37**

336. అశోకః = శోకమోహములు, అకలిదప్పులు,జరామరణముల వలన కలుగు(దుఃఖము) లేనివాడు.
337. తారణః = సంసార సాగరమునుండి తరింపజేయువాడు.
338. తారః = జన్మ, జరా, మరణరూపమైన దు:ఖమునుండి జీవులను ఉద్ధరించువాడు.
339. శూరః = 1. మిక్కిలి విక్రమము గలవాడు. 2. ఆసురశక్తులను అణిచి, ధర్మమును ప్రతిష్ఠించువాడు.
340. శౌరిః = శూరసేనుని వంశమున కృష్ణునిగా అవతరించినవాడు.
341. జనేశ్వరః = జనులకు, జంతువులకు (ఈశ్వరుడు) ప్రభువు.
342. అనుకూలః = అందఱికి ఆత్మయై, వారికి అనుకూలుడైనవాడు.
343. శతావర్తః = ధర్మరక్షణము కొఱకు పెక్కుమార్లు అవతరించినవాడు



344. పద్మీ = జ్ఞానమును సూచించు, పద్మమును చేతిలో ధరించువాడు.
345. పద్మనిభేక్షణః = 1. పద్మములవంటి నేత్రములు గలవాడు. 2. జ్ఞాననేత్రుడు.

**శ్లో॥ పద్మనాభో, ఽ రవిందాక్షః, పద్మగర్భ, శ్శరీరభృత్,।**
**మహర్ధిర్, ఋద్ధో, వృద్ధాత్మా, మహాక్షో, గరుడధ్వజః,॥ 38**

346. పద్మనాభః = 1. పద్మముయొక్క నాభి భాగముగ నుండువాడు. 2. పద్మము నాభియందు కలవాడు.
347. అరవిందాక్షః = కమలములవంటి కన్నులు గలవాడు.
348. పద్మగర్భః = యోగుల హృదయ పద్మమున ధ్యానింపబడువాడు.
349. శరీరభృత్ = 1. అన్నము, ప్రాణము తానై శరీరములను పోషించువాడు. 2. ధర్మసంస్థాపనకై అనేక అవతారములు ఎత్తినవాడు.
350. మహర్ధిః = మహిమలతో కూడిన గొప్ప ఐశ్వర్యము కలవాడు.
351. ఋద్ధః = ప్రపంచ రూపమున ప్రకాశించువాడు.
352. వృద్ధాత్మా = లోకములకు ఆదియందుండు వాడగుటచే వృద్ధుడు.
353. మహాక్షః = సత్యమును చూడగల గొప్ప కనులు గలవాడు.
354. గరుడధ్వజః = వేదవిజ్ఞాన రూపమగు గరుడుని తన (ధ్వజము)జెండాపై నిలిపినవాడు.

**శ్లో॥ అతుల, శ్శరభో, భీమ, స్సమయజ్ఞో, హవిర్హరిః,।**
**సర్వలక్షణలక్షణ్యో, లక్ష్మీవా, న్స్సమితిఞ్జయః,॥ 39**

355. అతులః = సాటిలేనివాడు.
356. శరభః = జీవశరీరములయందు చైతన్యమై ప్రకాశించువాడు.
357. భీమః = దుర్జనులకు భయమును కలిగించువాడు.
358. సమయజ్ఞః = ఎప్పుడేది, ఎవరికెంత చెందునట్లు చేయవలయునో (ఆ సమయము) తెలిసినవాడు.
359. హవిర్హరిః = యజ్ఞములలో హవిస్సులను గ్రహించువాడు.
360. సర్వలక్షణలక్షణ్యః = 1. అన్ని సిద్ధాంతములచేత తెలియబడువాడు. 2. సకల శుభలక్షణములు కలవాడు.
361. లక్ష్మీవాన్ = లక్ష్మీదేవి ఎల్లప్పుడు తన వక్షస్థలమున కలవాడు.

362. సమితిఞ్జయః = ధర్మపక్షముననిలిచి యుద్ధములందు ఎల్లప్పుడు జయించువాడు.

**శ్లో॥ విక్షరో, రోహితో, మార్గో, హేతు, ర్దామోదర, స్సహః,।**
**మహీధరో, మహాభాగో, వేగవా, నమితాశనః,॥ 40**

363. విక్షరః = కాలాతీతుడై నాశములేనివాడు. శాశ్వతుడు.
364. రోహితః = రోహితమను మత్స్య రూపమును ధరించినవాడు. 2.సూర్యమండలమునందుంటచే ఎఱ్ఱనివాడు.
365. మార్గః = భక్తులు తరించుమోక్ష మార్గమైనవాడు.
366. హేతుః = సకల సృష్టికి కారణమైనవాడు.
367. దామోదరః = 1. దమ మనెడి ఇంద్రియ నిగ్రహముచే తెలియబడువాడు. 2. లోకములు తన ఉదరమున గలవాడు. 3. యశోదచే దారముతో కట్టబడిన ఉదరము కలవాడు.
368. సహః = సహనశీలము కలవాడు. తప్పుల క్షమించువాడు.
369. మహీధరః = పర్వతరూపమున భూమిని మోయుచున్నవాడు.
370. మహాభాగః = అధికమగు తన భాగ్యమును బహుదేహధారియై అనుభవించువాడు.
371. వేగవాన్ = భక్తులను (గజేంద్రుని) రక్షించుటలో మిక్కిలి వేగము కలవాడు.
372. అమితాశనః = అమితమగు ఆకలితో ప్రళయకాలమున ప్రపంచమును భక్షించువాడు.

**శ్లో॥ ఉద్భవః, క్షోభణో, దేవ, శ్రీగర్భః, పరమేశ్వరః,।**
**కరణం, కారణం, కర్తా వికర్తా, గహనో, గుహః,॥ 41**

373. ఉద్భవః = అన్ని విధముల ప్రపంచసృష్టికి కారణమైనవాడు.
374. క్షోభణః = 1.మనసులను కల్లోల పఱచువాడు. 2.ప్రకృతి పురుషులందు ప్రవేశించి, వారిని సృష్టికి ఉన్ముఖులను చేయువాడు. మన్మథస్వరూపుడు.
375. దేవః = సకల భూతములందుండి ప్రకాశించువాడు.
376. శ్రీగర్భః = సకల సంపదలు తన గర్భమునందు కలవాడు.
377. పరమేశ్వరః = విభూతులతోగూడి ఉన్నతుడై, అన్ని లోకములను శాసించుచున్నవాడు.



378. కరణమ్ = జగములు ఏర్పడుటకు ముఖ్య సాధనమైనవాడు.
379. కారణమ్ = లోకములందలి కార్యములన్నింటికి కారణమైనవాడు.
380. కర్తా = ఇతరులపై ఆధారపడక చేయుపనులన్నింటిలోను తాను స్వతంత్రుడైనవాడు.
381. వికర్తా = విచిత్రములైన ఈ జగములను సృష్టించువాడు.
382. గహనః = బుద్ధిచే గ్రహింప శక్యము కానివాడు.
383. గుహః = మాయతో కప్పబడినవాడు. హృదయగుహలో నుండువాడు.

**శ్లో॥ వ్యవసాయో,వ్యవస్థానః, స్సంస్థాన, స్థానదో, ధృవః,।**
**పరర్ధిః, పరమస్పష్ట, స్తుష్టః, పుష్ట, శ్శుభేక్షణః,॥ 42**

384. వ్యవసాయః = 1.అనుకున్నది (లక్ష్యము) సాధించువఱకు కృషిచేయువాడు. 2.జ్ఞానస్వరూపుడు.
385. వ్యవస్థానః = చేయదలచుకొన్న జగద్వవహారములను యథావిధిగా చేయువాడు.
386. సంస్థానః = జీవులకు చేరవలసిన పరమ స్థానమైనవాడు.
387. స్థానదః = కర్మలను బట్టి జీవులకు ఆయా స్థానములనిచ్చువాడు. ఉదా: ధ్రువుడు.
388. ధృవః = శాశ్వతముగా ఉండువాడు.
389. పరర్ధిః = కల్యాణగుణములతో మిక్కిలి వైభవము కలవాడు.
390. పరమస్స్పష్టః = తేజోవంతుడై సాధుజనులచే చక్కగా తెలియబడువాడు. అంతటా ప్రకాశించువాడు.
391. తుష్టః = భక్తులు చేయు ఏ కొద్ది ఉపచారములకైనను పరమానందభరితుడై తృప్తినొందువాడు.
392. పుష్టః = జ్ఞానముచే పరిపూర్ణుడైన వాడు.
393. శుభేక్షణః = తన చల్లని చూపులతో శుభములను ప్రసాదించువాడు.

**శ్లో॥ రామో, విరామో, విరతో(జో), మార్గో, నేయో, నయో, ఽనయః।**
**వీర, శ్శక్తిమతాంశ్రేష్ఠో, ధర్మో, ధర్మవిదుత్తమః,॥ 43**

394. రామః = పరబ్రహ్మ స్వరూపుడు. యోగులు నిత్యానందముతో సుఖించు రూపము గలవాడు. అందఱిని ఆనందింప జేయువాడు.

395. విరామః = సకల జీవులకు విశ్రామస్థానమైనవాడు.
396. విరతః = రాగస్వరూపమైన విషయ వాంఛలులేని ఆనంద స్వరూపుడు.
397. మార్గః = మోక్షమునకు మార్గమైనవాడు.
398. నేయః = ఆత్మజ్ఞానముతో జీవుని, పరమాత్మతో చేర్చువాడు.
399. నయః = భక్తులను ముక్తి స్థానమునకు నడిపించు నాయకుడు.
400. అనయః = బలవంతముగా ఇతరులచే నడిపింప వీలుపడనివాడు.
401. వీరః = అజేయమగు తన పరాక్రమముచే శత్రువుల గుండెలలో భయమును పుట్టించువాడు.
402. శక్తి మతాంశ్రేష్ఠః = ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులతో కూడి, శక్తిమంతులలో కెల్ల ఉత్తముడైనవాడు.
403. ధర్మః = ధర్మస్వరూపుడు. (రామోవిగ్రహవాన్ధర్మః)
404. ధర్మవిదుత్తమః = ధర్మము తెలిసిన వారిలో ఉత్తముడు.

**శ్లో॥ వైకుంఠః, పురుషః, ప్రాణః, ప్రాణదః, ప్రణవః, పృథుః,।**
**హిరణ్యగర్భ, శ్శత్రుఘ్నో, వ్యాప్తో, వాయు, రధోక్షజః,॥ 44**

405. వైకుంఠః = భక్తుల హృదయములు ముక్తికి అనుకూలముగా ఉండునట్లు చేయువాడు.
406. పురుషః = 1.సృష్టికి పూర్వమున ఉన్నవాడు. 2.సర్వపాపములను పోగొట్టువాడు.
407. ప్రాణః = జీవుల ప్రాణమై, చైతన్యమును గూర్చువాడు.
408. ప్రాణదః = సృష్టి ప్రారంభమున జీవులకుప్రాణములిచ్చి, ప్రళయ కాలమున సంహరించువాడు.
409. ప్రణవః = అందరిచేత ఉపాసింపదగిన ఓంకార స్వరూపుడు.
410. పృథుః = 1.విశ్వరూపమును దాల్చినవాడు. 2.పృథువుగా పుట్టినవాడు.
411. హిరణ్యగర్భః = బ్రహ్మపుట్టుకకు ఆధారమైన బంగారు అండము గర్భముననున్నవాడు.
412. శత్రుఘ్నః = అసురులను, ఆసురీభావములను (కామక్రోధాదులను) నశింపజేయువాడు.



413. వ్యాప్తః = అంతట వ్యాపించి ఉన్నవాడు.
414. వాయుః = వాయు రూపమున లోకములందు వ్యాపించి జీవులను పోషించువాడు.
415. అథోక్షజః = ఎట్టి వికారములు లేక ఎల్లప్పుడు స్వరూపస్థితి యందుండువాడు. యోగులకు దర్శనమిచ్చువాడు.

**శ్లో॥ ఋతుః, స్సుదర్శనః, కాలః, పరమేష్ఠీ, పరిగ్రహః,।**
**ఉగ్ర, స్సంవత్సరో, దక్షో, విశ్రామో, విశ్వదక్షిణః,॥ 45**

416. ఋతుః = మిక్కిలి సుందరమగు ఋతు వైభవముగా నున్నవాడు. కాలస్వరూపుడు.
417. సుదర్శనః = భక్తులకు అందమగురూపముతో కనబడువాడు.
418. కాలః = 1.శత్రువులకు మృత్యురూపమున దర్శనమిచ్చువాడు. 2. దినము, వారము, నెల, సంవత్సరము మొదలగు గణనతో కూడిన కాలస్వరూపుడు.
419. పరమేష్ఠీ = హృదయాకాశమున ప్రకాశించువాడు.
420. పరిగ్రహః = భక్తితో నివేదించు దానిని (పత్రపుష్పఫలములు) ప్రియముగా గ్రహించువాడు-భక్తులకు అంతటా గోచరించువాడు.
421. ఉగ్రః = భయంకరుడు. (పంచభూతములు ఆతనికి భయపడి తమ కర్తవ్యమును పాటించుచున్నవి)
422. సంవత్సరః = సకల జీవులను తనయందు వసింపజేయువాడు.
423. దక్షః = అన్నిపనులను త్వరగా, సమర్థతతో నిర్వహించువాడు.
424. విశ్రామః = జీవులకు కోరిన ముక్తినిచ్చుచు విశ్రామ స్థానమైనవాడు.
425. విశ్వదక్షిణః = లోకములో వారందరికంటే నేర్పుగలవాడు.

**శ్లో॥ విస్తార, స్థావరస్థాణుః, ప్రమాణం, బీజమవ్యయమ్,।**
**అర్థో, ఉనర్థో, మహాకోశో, మహాభోగో, మహాధనః,॥ 46**

426. విస్తారః = లోకములన్నియు తనయందు విస్తరించి ఉన్నవాడు.
427. స్థావరఃస్థాణుః = ప్రకృతికి ఆధారుడై కదలనివాడు.
428. ప్రమాణం = జ్ఞానస్వరూపుడై, వేదాదులందు ప్రమాణముగ చెప్పబడినవాడు.

429. బీజమవ్యయం = లోకములకు ఆధారమైన విత్తువంటి వాడు, స్వభావమునందు వికారము, వినాశము లేనివాడు.

430. అర్థః = ఆనంద స్వరూపుడై, అందరిచేత కోరబడువాడు.

431. అనర్థః = ఇతరులను ఏదియు కోరనివాడు. (పరిపూర్ణుడు)

432. మహాకోశః = అన్నమయాది 5 (పంచ) కోశములుగా ఉన్నవాడు (1.అన్నము 2.ప్రాణము 3.మనస్సు 4.విజ్ఞానము 5.ఆనందము.)

433. మహాభోగః = సత్, చిత్, ఆనంద భోగములు అనుభవించువాడు.

434. మహాధనః = సకల ఐశ్వర్యములు కలవాడు. భక్తులకు కోరిన కోర్కెలు సమకూర్చువాడు.

**శ్లో॥ అనిర్విణ్ణ, స్థవిష్ఠో౽భూ, ర్ధర్మయూపో, మహామఖః,।**
**నక్షత్రనేమి, ర్నక్షత్రీ, క్షమః, క్షామ, స్సమీహనః,॥ 47**

435. అనిర్విణ్ణః = ఏ కోరికలు లేకపోవుటచే, అవి తీరలేదను వేదన లేనివాడు.

436. స్థవిష్ఠః = విశ్వరూపమున, సూర్య చంద్రాగ్నులు, మొ॥దేవతలు తన అవయవములుగా కలవాడు.

437. అభూః = పుట్టుకలేనివాడు. స్థిరుడు, శాశ్వతుడు.

438. ధర్మయూపః = యజ్ఞములందు యూపస్థంభమువలె ధర్మములకు ఆధారమైనవాడు.

439. మహామఖః = యజ్ఞస్వరూపుడై సత్కర్మములకు ఫలమునిచ్చువాడు.

440. నక్షత్రనేమిః = మధ్యలో ఇరుసుగా ఉండి, నక్షత్రములతో కూడిన జ్యోతిశ్చక్రమును త్రిప్పువాడు.

441. నక్షత్రీ = చంద్రుడై, నక్షత్రములకు అధిపతియైనవాడు.

442. క్షమః = (సహనము) ఓర్పుకలవాడు. సమర్థుడు.

443. క్షామః = ప్రళయకాలముననను, నశింపనివాడు.

444. సమీహనః = 1) సకల లోకములకు హితము కోరువాడు.
2) ప్రలయ, సృష్టికార్యములు చక్కగా చేయువాడు.

**శ్లో॥ యజ్ఞ, ఇజ్యో, మహేజ్యశ్చ, క్రతు, స్సత్రం, సతాంగతిః,।**
**సర్వదర్శీ, విముక్తాత్మా, సర్వజ్ఞో, జ్ఞానముత్తమమ్,॥ 48**

445. యజ్ఞః = యజ్ఞస్వరూపుడు (యజ్ఞోవైవిష్ణుః)

446. ఇజ్యః = యజ్ఞములందు ప్రధానముగా పూజింపబడువాడు.



447. మహేజ్యః = జీవులకు ముక్తిని ప్రసాదించు దేవతలలో ముఖ్యుడుగా ఆరాధింపబడువాడు. మహావిష్ణువు.

448. క్రతుః = యూపముతో కూడిన యజ్ఞమే క్రతువు. ఆ క్రతుస్వరూపుడైనవాడు.

449. సత్రమ్ = యజ్ఞములను, సజ్జనులను కాపాడువాడు.

450. సతాంగతిః = సత్పురుషులకు గమ్యమై, అచటికి చేర్చు ముక్తి మార్గము అయినవాడు.

451. సర్వదర్శీ = ప్రాణులు చేయు (మంచి, చెడు) పనులన్నింటిని స్వయముగా గమనించువాడు.

452. విముక్తాత్మా = ముక్తుడైయుండి, జీవులకు ముక్తినిచ్చువాడు.

453. సర్వజ్ఞః = అన్నియు తెలిసినవాడు. అన్నిరూపములుఐనవాడు.

454. జ్ఞానముత్తమమ్ = మిక్కిలి గొప్పదగు ఆత్మజ్ఞానము కలవాడు.

**శ్లో॥ సువ్రత, స్సుముఖ, స్సూక్ష్మ, స్సుఘోష, స్సుఖద, స్సుహృత్,।**
**మనోహరో, జితక్రోధో, వీరబాహు, ర్విదారణః,॥ 49**

455. సువ్రతః = ఆశ్రితులకు అభయమిచ్చు వ్రత దీక్షగలవాడు.

456. సుముఖః = సుఖదుఃఖములకు కలతపడని ప్రసన్న వదనము గలవాడు.

457. సూక్ష్మః = సూక్ష్మరూపమున జగమంతయు (పంచ భూతమయుడై) వ్యాపించియుండువాడు.

458. సుఘోషః = వేదరూపమైన చక్కని నాదము గలవాడు.(వేదము చేత తెలియదగినవాడు). వేదమే తానైనవాడు.

459. సుఖదః = ధర్మమార్గమున నడచువారికి సుఖములను ఇచ్చువాడు.

460. సుహృత్ = ప్రతిఫలమునాశింపక స్నేహభావముతో ఉపకారము చేయువాడు.

461. మనోహరః = తన కల్యాణ గుణములతో మనస్సులను హరించువాడు.

462. జితక్రోధః = క్రోధమును జయించినవాడు.

463. వీరబాహుః = వేదధర్మ రక్షణమునకు కంకణము ధరించిన, పరాక్రమముతో కూడిన బాహువులు కలవాడు.

464. విదారణః = అధర్మ పరులైన రాక్షసులను చీల్చిచెండాడువాడు.

**శ్లో॥ స్వాపన, స్వవశో, వ్యాపీ, నైకాత్మా, నైకకర్మకృత్,।**
**వత్సరో, వత్సలో, వత్సీ, రత్నగర్భో, ధనేశ్వరః,॥ 50**

465. స్వాపనః = ఆత్మజ్ఞానరహితులనుచేసి జీవులను మాయతో నిద్ర పుచ్చువాడు.
466. స్వవశః = జగత్పరిపాలనమున స్వతంత్రుడు.
467. వ్యాపీ = ఆకాశమువలె అంతట వ్యాపించియుండువాడు.
468. నైకాత్మా = అనేక రూపములతో వెలుగొందుచుండువాడు.
469. నైకకర్మకృత్ = సృష్టి, స్థితి, లయాదులగు పెక్కు పనులు చేయువాడు.
470. వత్సరః = సకల జగములు తనయందుండువాడు.
471. వత్సలః = భక్తులయందు అధికమగు (వాత్సల్యము) ప్రేమ గలవాడు.
472. వత్సీ = జగములకుపెద్దయై, తండ్రివలె కాపాడువాడు.
473. రత్నగర్భః = రత్నములన్నియు గర్భమునగలవాడు. సాగరుడైయుండువాడు. కల్యాణగుణాకరుడు.
474. ధనేశ్వరః = సకల ధనములకు ప్రభువు. లక్ష్మీపతి.

**శ్లో॥ ధర్మగు, బ్ధర్మకృ, ద్ధర్మీ, స, దసత్, క్షర, మక్షరం,।**
**అవిజ్ఞాతా, సహస్రాంశు, ర్విధాతా, కృతలక్షణః,॥ 51**

475. ధర్మగుప్ = ధర్మమును రక్షించుటకు ఎన్నో అవతారములు ధరించినవాడు
476. ధర్మకృత్ = లోక కల్యాణము కొరకు ధర్మ కర్మములాచరించువాడు.
477. ధర్మీ = ధర్మమునకు ఆధారమై లోకములను పాలించువాడు.
478. సత్ = ధర్మస్వరూపుడై, శాశ్వతముగా నుండువాడు.
479. అసత్ = నిత్య పరిణామశీలమైన జగద్రూపమునఉండువాడు.
480. క్షరమ్ = నశించు జీవుల రూపమున నుండువాడు.
481. అక్షరమ్ = అశాశ్వతమగు ప్రపంచమునందు చైతన్య స్వరూపమగు ఆత్మశక్తిగా శాశ్వతుడైయుండువాడు.
482. అవిజ్ఞాతా = జీవుల కంటె వేరుగా ఉండు పురుషోత్తముడు.
483. సహస్రాంశుః = అనంత కిరణములుగల సూర్యాదుల రూపమున ప్రకాశించుచున్నవాడు.
484. విధాతా = విశ్వము సర్వమునకు ఆధారమైనవాడు.



485. కృతలక్షణః = 1.నిత్యచైతన్య స్వరూపుడు. 2.వేదశాస్త్రములను వెలువరించినవాడు. 3.'శ్రీవత్సము'ను పుట్టుమచ్చ కలవాడు.

**శ్లో॥ గభస్తినేమి, స్సత్త్వస్థ, స్సింహో, భూతమహేశ్వరః,।**
**ఆదిదేవో, మహాదేవో, దేవేశో, దేవభృద్గురుః,॥ 52**

486. గభస్తినేమిః = కాంతి(కాల) చక్రమున సూర్యుడై ప్రకాశించువాడు. సుదర్శన చక్రమును ధరించినవాడు.
487. సత్త్వస్థః = 1.ప్రాణులందరిలో నుండువాడు. 2.సాత్త్వికులైన భక్తులయందు ప్రకాశించువాడు. (ఉదా: అంబరీషుడు)
488. సింహః = 1. సింహమువలె పరాక్రమశాలి. 2.అధర్మమును తుదముట్టింప, నరసింహావతారమునెత్తినవాడు.
489. భూతమహేశ్వరః = సకల భూతములకు ప్రభువై శాసించువాడు.
490. ఆదిదేవః = సృష్టికిముందున్నవాడు. తొలిదైవము.
491. మహాదేవః = సృష్టికి మూలమై, దేవతలకెల్ల దేవుడై ఉండువాడు.
492. దేవేశః = బ్రహ్మదేవునికి తండ్రి. దేవతలను శాసించువాడు.
493. దేవభృద్గురుః = దేవేంద్రునకుకూడ జ్ఞానోపదేశముచేసిన గురువు.

**శ్లో॥ ఉత్తరో, గోపతి, ర్గోప్తా, జ్ఞానగమ్యః, పురాతనః,।**
**శరీరభూతభృ, ద్భోక్తా, కపీంద్రో, భూరిదక్షిణః,॥ 53**

494. ఉత్తరః = అందరికంటె ఉత్తముడైనవాడు. జీవులను సంసారమునుండి తరింపజేయువాడు.
495. గోపతిః = గోవులను, భూమిని, వాక్కును, ఇంద్రియములను కాపాడువాడు.
496. గోప్తా = అందరిని సంరక్షించువాడు.
497. జ్ఞానగమ్యః = జ్ఞానము చేతనే తెలియబడువాడు.
498. పురాతనః = సృష్టికి పూర్వమునందున్నవాడు. ప్రాచీనుడు.
499. శరీరభూతభృత్ = శరీరములకు కారణమైన, పంచభూతములను కూడ పోషించువాడు.
500. భోక్తా = 1.లోకములను పాలించువాడు. 2.జీవుడై ఆనందమును అనుభవించువాడు.

501. కపీంద్రః = 1.యజ్ఞవరాహావతారుడైనవాడు.
2.రామావతారమున వానరులకు ప్రభువు

502. భూరిదక్షిణః = 1.యజ్ఞసమయంలో (భూరి)ఎక్కువ ధనమును దక్షిణగా ఇచ్చువాడు. 2.భక్త కోటిని వరములతో అనుగ్రహించువాడు. 3.జ్ఞానయజ్ఞము చేయువారికి అమృతత్వము నిచ్చువాడు.

**శ్లో॥ సోమపో, ఉమృతప, స్సోమః, పురుజి, త్పురుసత్తమః,।**
**వినయో, జయ, స్సత్యసంధో, దాశార్హ, స్సాత్వతాంపతిః,॥ 54**

503. సోమపః = యజ్ఞములందు భక్తులచే ఇవ్వబడెడు సోమరసమును స్వీకరించువాడు.

504. అమృతపః = అమృతమును, ఆత్మానందమునుఅనుభవించువాడు.

505. సోమః = రసస్వరూపుడగు చంద్రుని రూపమున ఓషధులను పోషించువాడు.

506. పురుజిత్ = యుద్ధమున తానొక్కడే, అనేకులను ఎదిరించి జయించువాడు. (శ్రీరాముడు)

507. పురుసత్తమః = ఉత్తములలోకెల్ల ఉత్తముడు.

508. వినయః = 1.దుష్టులను దండించి, వినయమును నేర్పువాడు. 2.సాధకులను సత్యమువైపు నడుపువాడు. 3.నీతి శాస్త్రమున విశేష ప్రజ్ఞకలవాడు.

509. జయః = అందరిని జయించి, వశపరచుకొనువాడు.

510. సత్యసంధః = సత్యముతో కూడిన సంకల్పములు, వాక్కులు కలవాడు.

511. దాశార్హః = దశార్హుడను వాని వంశమున పుట్టినవాడు.

512. సాత్వతాంపతిః = సాత్వత కులమునకు(యదువంశము) ప్రభువు.

**శ్లో॥ జీవో, వినయితాసాక్షీ, ముకుందో, ఉ మితవిక్రమః,।**
**అంభోనిధి, రనన్తాత్మా, మహోదధిశయో, ఉన్తకః,॥ 55**

513. జీవః = సకల దేహములందు ప్రాణధారణ చేయు జీవుడైయున్నవాడు.

514. వినయితాసాక్షీ = 1.భక్తులయందుండు వినయమును గమనించువాడు. 2.యుగధర్మపాలనమును పరిశీలించువాడు.

515. ముకుందః = శరణుజొచ్చిన వారిని అనుగ్రహించి, ముక్తిని ఇచ్చువాడు.



516. అమిత విక్రమః= మిక్కిలి విక్రమము గలిగి ముల్లోకములను ఆక్రమించిన త్రివిక్రమావతారము దాల్చినవామనుడు.

517. అంభోనిధిః = నీటికి స్థానమైనవాడు. సాగర స్వరూపుడు.

518. అనంతాత్మా = 1.అంతులేని (లెక్కకు మిక్కిలి) శరీరములందు ఆత్మగా ప్రకాశించువాడు. 2.అనంతుని (ఆదిశేషుడు) రూపముతో ప్రకాశించువాడు.

519. మహోదధిశయః= 1.క్షీరసాగరమున, శేషతల్పమున పరుండువాడు. 2.ప్రళయ కాలమున అపారజలరాశియందు నిదురించువాడు.

520. అన్తకః = యుగాంతమున సృష్టి సకలమును అంతము చేయువాడు. (యముడైనవాడు)

**శ్లో॥ అజో, మహార్హ, స్స్వాభావ్యో, జితామిత్రః, ప్రమోదనః,।**
**ఆనందో, నందనో, నంద, స్సత్యధర్మా, త్రివిక్రమః,॥ 56**

521. అజః = పుట్టుకలేనివాడు. కావున గిట్టుటయులేనివాడు.

522. మహార్హః = ముక్తిని ప్రసాదించువాడగుటచే పూజార్హుడైనవాడు.

523. స్వాభావ్యః = స్వ స్వరూపమగు చైతన్యమై ప్రకాశించువాడు.

524. జితామిత్రః = శత్రువులగు రాక్షసులను, కామాంధులను, అరిషడ్వర్గములను జయించువాడు.

525. ప్రమోదనః = సంతతానందము కలవాడు. ఆశ్రితులకు ఆనందమునిచ్చువాడు.

526. ఆనందః = ఆనంద స్వరూపుడు. (ఆనందోబ్రహ్మ).

527. నందనః = అనుగ్రహముతో అందరికి ఆనందము ఇచ్చువాడు.

528. నందః = ఇంద్రియ సుఖములకు అందనివాడు.

529. సత్యధర్మా = మాటలో, మనుగడలో శాశ్వతములగు సత్య ధర్మములు గలవాడు.

530. త్రివిక్రమః = మూడడుగులలో ముల్లోకములను వ్యాపించినవాడు.

**శ్లో॥ మహర్షిఃకపిలాచార్యః, కృతజ్ఞో, మేదినీపతిః,।**
**త్రిపద, స్త్రిదశాధ్యక్షో, మహాశృంగః, కృతాన్తకృత్,॥ 57**

531. మహర్షిఃకపిలాచార్యః= వేదవిదుడైన కపిలాచార్యునిగా అవతరించిన వాడు.

532. కృతజ్ఞః = సృష్టియు, సృష్టికర్తయు అయినవాడు. భక్తులు

చేసిన దానిని మదిలో గుర్తించువాడు.

533. మేదినీపతిః = భూమిని భరించువాడు. (భూభర్త)

534. త్రిపదః = అ, ఉ, మ అను మూడుపదములు కలవాడు. (త్రిగుణాతీతుడు.) ఓంకారస్వరూపుడు.

535. త్రిదశాధ్యక్షః = జాగ్రత్, స్వప్న, సుషుప్తి వ్యవస్థలకు అతీతుడు. (సాక్షి)

536. మహాశృంగః = మత్స్య, వరాహరూపములందు కొమ్మును తాల్చినవాడు.

537. కృతాంతకృత్ = మృత్యువును ఖండించువాడు. హిరణ్యాక్షుని అంతమొందించినవాడు.

**శ్లో॥ మహావరాహో, గోవింద, స్సుషేణః, కనకాంగదీ,।**
**గుహ్యో, గభీరో, గహనో, గుప్త, శ్చక్రగదాధరః,॥ 58**

538. మహావరాహః = హిరణ్యాక్షుని జంపి భూమిని ఉద్ధరించుటకై మిక్కిలి మహిమగల వరాహమూర్తిగా అవతరించినవాడు.

539. గోవిందః = సాగర గర్భములో మునిగియున్న భూదేవిని వెతికి, వెలికి తెచ్చినవాడు.

540. సుషేణః = పార్శ్వచరులు, పార్షదులు, దేవతలు, భక్తులు, ఋషులు, మునులు మొ॥వారు, గొప్ప సేనలుగా కలవాడు.

541. కనకాంగదీ = బంగారు భుజకీర్తులు కలవాడు.

542. గుహ్యః = హృదయ గుహయందుండువాడు. ఉపనిషద్వాక్యములచే తెలియబడువాడు.

543. గంభీరః = జ్ఞానము, ఐశ్వర్యము, బలము, వీర్యము మొ॥ గుణములతో గంభీరుడై ఉండువాడు.

544. గహనః = సామాన్యులు సులభముగ గ్రహించుటకు వీలుకానివాడు.

545. గుప్తః = జీవులందరికి కనబడకుండ ఉండువాడు.

546. చక్రగదాధరః = 'సుదర్శన'మను చక్రమును, 'కౌమోదకి'యను గదను ఆయుధములుగా ధరించినవాడు.

**శ్లో॥ వేధా, స్స్వాంగో, ఉజితః, కృష్ణో, దృఢ, స్సంకర్షణో, ఉచ్యుతః,।**
**వరుణో, వారుణో, వృక్షః, పుష్కరాక్షో, మహామనాః,॥ 59**

547. వేధాః = సృష్టికి కర్తయు, కారణము అయినవాడు.

548. స్వాంగః = సృష్టి కార్యమునకు అవసరమగు సాధన సామగ్రియు తానే అయినవాడు.

549. అజితః = ఇతరులచే జయింపబడనివాడు.



550. కృష్ణః = 1. నీలిమేఘమువలె నల్లనివాడు, 2. కృష్ణద్వైపాయనుడనబడు వేదవ్యాసుడు ఐనవాడు.

551. దృఢః = స్వరూపస్థితి నుండి చలింపని స్వభావము కలవాడు.

552. సంకర్షణోఽచ్యుతః = ప్రళయకాలమున సృష్టిసర్వమును తనయందిముడ్చుకొనినను ఎట్టిమార్పు చెందనివాడు.

553. వరుణః = సాయంసమయమందు, తనకిరణములను ఉపసంహరించుకొను సూర్యనిరూపమున ఉన్నవాడు.

554. వారుణః = భగవదంశతో పుట్టిన వరుణుని కుమారులైన వశిష్ఠుడు, అగస్త్యుడుకూడ అయినవాడు.

555. వృక్షః = అనుగ్రహమను నీడనిచ్చు 'వృక్షము' అయినవాడు. ఆశ్రితరక్షకుడు. కదలక వైకుంఠమున నుండువాడు.

556. పుష్కరాక్షః = 1.ఆకాశమువలె అంతటా వ్యాపించినవాడు. 2.హృదయపద్మమున ఉండువాడుకమలనయనుడు.

557. మహామనాః = ప్రేమ, ఔదార్యముకల గొప్పమనస్సు ఉన్నవాడు.

**శ్లో॥ భగవా, న్భగహా, ఉఽనందీ, వనమాలీ, హలాయుధః,।**
**ఆదిత్యో, జ్యోతిరాదిత్య, స్సహిష్ణు, ర్గతిసత్తమః,॥ 60**

558. భగవాన్ = ఐశ్వర్యము, ధర్మము, యశస్సూ, సంపద,జ్ఞానము, వైరాగ్యము అను ఆరువిధములైన ఐశ్వర్యసంపదలు కలవాడు.

559. భగహా = ప్రళయకాలమున విశేష శక్తులన్నింటిని నశింప జేయువాడు.

560. ఆనందీ = 1.ఆనందమేస్వభావముగా కలవాడు. 2.ఆనందమును ఇచ్చువాడు.

561. వనమాలీ = "వైజంతి" అనుమాలను సదాధరించువాడు.

562. హలాయుధః = "నాగలి" ఆయుధముగా ధరించువాడు. (బలరాముడు.)

563. ఆదిత్యః = అదితికశ్యపుల గర్భమున వామనునిగ పుట్టినవాడు.

564. జ్యోతిరాదిత్యః = ఆకాశమండలమున సూర్యనారాయణుడై ప్రకాశించువాడు.

565. సహిష్ణుః = 1.ఓర్పుగలవాడు. 2.సుఖదు:ఖములు, శీతోష్ణాదులైన ద్వంద్వములను సమానముగా భరించువాడు.

566. గతిసత్తమః = సజ్జనులకు, భక్తులకు ఆశ్రయింపదగినవాడు

**శ్లో॥ సుధన్వా, ఖండపరశు, ర్దారుణో, ద్రవిణప్రదః,।**
**దివస్పృ ృ, క్సర్వదృగ్వ్యాసో, వాచస్పతిరయోనిజః,॥ 61**

567. సుధన్వా = 'శార్ఙ్గము' అను గొప్పవిల్లును ధరించువాడు. త్రేతాయుగమున కోదండరాముడుగా అవతరించినవాడు.

568. ఖండపరశుః = శత్రువులను ఖండించు గండ్రగొడ్డలిని ధరించువాడు. పరశురాముడు.

569. దారుణః = దుష్టులైన రాక్షసులను భయపెట్టి, హింసించువాడు.

570. ద్రవిణప్రదః = భక్తులకు కావలసిన సంపదలిచ్చువాడు.

571. దివస్పృక్ = ఆకాశమువరకు వ్యాపించియుండువాడు. త్రివిక్రముడు. స్వర్గమును స్పృశించియుండువాడు.

572. సర్వదృగ్వ్యాసః = వేదములను విభజించిన వేదవ్యాసుని రూపమున ఇతిహాస పురాణముల ద్వారా సమస్త విజ్ఞానము నందించినవాడు.

573. వాచస్పతిరయోనిజః = తల్లిదండ్రుల కడుపున పుట్టుక లేనివాడయ్యి, విద్యల కధిపతియైనవాడు.

**శ్లో॥ త్రిసామా, సామగ, స్సామ, నిర్వాణం, భేషజం, భిషక్,।**
**సంన్యాసకృ, చ్ఛమ, శ్శాంతో, నిష్ఠా, శాంతిః, పరాయణమ్,॥ 62**

574. త్రిసామా = బృహత్, రథంతర, నామము లనెడి సామవేదమంత్రములచే నుతింపబడువాడు.

575. సామగః = సామవేదమును గానముచేయువాడు. (ఉద్గాత)

576. సామ = సామవేదమే తానైనవాడు.

577. నిర్వాణమ్ = దు:ఖములు పోగొట్టి ఆనందమునిచ్చు నట్టి మోక్షమునకు స్థానమైనవాడు.

578. భేషజమ్ = భవరోగమునకు దివ్యౌషధమైనవాడు.

579. భిషక్ = భవరోగమును మాన్పు గీతను చెప్పిన గొప్పవైద్యుడు.

580. సంన్యాసకృత్ = వైరాగ్యమును బోధించి, త్యాగభావమును పెంపొందించు సంన్యాసాశ్రమమును సూచించువాడు.

581. శమః = శాంత స్వభావుడు. సహనమూర్తి.

582. శాంతః = ఇంద్రియ సుఖములందు ఆసక్తిలేనివాడు.

583. నిష్ఠా = ప్రళయకాలమున సకలజీవులకు స్థానమైనవాడు.



584. శాంతిః = అవిద్యను తొలగించి, శాంతిని ఇచ్చువాడు. (శాంతిస్వరూపుడు)

585. పరాయణమ్ = జీవులందఱికి పరమగమ్యమై పొందదగినవాడు.

**శ్లో॥ శుభాంగ, శ్శాంతిద, స్స్రష్టా, కుముదః, కువలేశయః,।**
**గోహితో, గోపతి, ర్గోప్తా, వృషభాక్షో, వృషప్రియః,॥ 63**

586. శుభాంగః = మంగళకరములగు అందమైన శరీరావయవములు గలవాడు.

587. శాంతిదః = రాగద్వేషములలేని శాంతిని ప్రసాదించువాడు.

588. స్రష్టా = జగములకు సృష్టికర్త.

589. కుముదః = (కు=భూమి) భూమినుండి సంతోషమును పొందువాడు.

590. కువలేశయః = పాలసముద్రమున, శేషశయనుడై పవళించువాడు.

591. గోహితః = గోవులకు, భూమికి హితముచేయువాడు.

592. గోపతిః = భూమికి భర్తయైనవాడు.

593. గోప్తా = జగములను కాపాడువాడు. మాయతో తనను తాను కప్పియుంచుకొనువాడు.

594. వృషభాక్షః = ధర్మదృష్టి కలవాడు. కోరికలను దీర్చు చల్లని చూపు కలవాడు.

595. వృషప్రియః = ధర్మమునందు, ధర్మాత్ములయందు ప్రీతికలవాడు.

**శ్లో॥ అనివర్తీ, నివృత్తాత్మా, సంక్షేప్తా, క్షేమకృ, చ్ఛివః,।**
**శ్రీవత్సవక్షా, శ్శ్రీనివాస, శ్శ్రీపతి, శ్శ్రీమతాంవరః,॥ 64**

596. అనివర్తీ = ధర్మమునుండి, యుద్ధమునుండి తొలగనివాడు.

597. నివృత్తాత్మా = ఇంద్రియసుఖములనుండి మరలిన మనస్సు కలవాడు.

598. సంక్షేప్తా = విస్తరించిన జగత్తును ప్రళయకాలమునందు సూక్ష్మముగా చేయువాడు.

599. క్షేమకృత్ = లోకములకు క్షేమమును గూర్చువాడు.

600. శివః = తనను ఆశ్రయించి, స్మరించిన వారిని పవిత్రము చేయువాడు.

601. శ్రీవత్సవక్షాః = 'శ్రీవత్స'మను పుట్టుమచ్చ రొమ్ముపై తాల్చువాడు.

602. శ్రీనివాసః = ఎల్లప్పుడు లక్ష్మికి, (సంపదలకు) స్థానమైనవాడు.
603. శ్రీపతిః = పాలసంద్రమున పుట్టిన లక్ష్మిచే వరింపబడినవాడు.
604. శ్రీమతాంవరః = వేద సంపద కలిగిన బ్రహ్మాదులకంటె శ్రేష్ఠుడు.

**శ్లో॥ శ్రీద, శ్శ్రీశ, శ్శ్రీనివాస, శ్శ్రీనిధి, శ్శ్రీవిభావనః,।**
**శ్రీధర, శ్శ్రీకర, శ్శ్రేయ, శ్శ్రీమా, న్లోకత్రయాశ్రయః,॥ 65**

605. శ్రీదః = భక్తులకు (మోక్ష) సంపద నిచ్చువాడు.
606. శ్రీశః = లక్ష్మీదేవికి భర్తయైనవాడు.
607. శ్రీనివాసః = భక్తి సంపన్నుల హృదయములలో నెప్పుడు ఉండువాడు. లక్ష్మిఉండుచోట నివసించువాడు.
608. శ్రీనిధిః = సకల సంపదలకు తరగని 'గని' ఐనవాడు.
609. శ్రీ విభావనః = జీవులకు, కర్మానుగుణముగ సంపదలిచ్చువాడు.
610. శ్రీధరః = లక్ష్మీదేవిని (సంపదను) ధరించువాడు.
611. శ్రీకరః = భక్తులకు శుభసంపదలిచ్చువాడు.
612. శ్రేయః = శాశ్వతమైన సుఖము(మోక్షము) తానైనవాడు.
613. శ్రీమాన్ = సకలసంపదలు కలవాడు. మాన్యుడు.
614. లోకత్రయాశ్రయః = మూడులోకములకు ఆధారమైనవాడు.

**శ్లో॥ స్వక్ష, స్స్వంగ, శ్శతానందో, నంది, ర్జ్యోతిర్గణేశ్వరః,।**
**విజితాత్మా, ఽవిధేయాత్మా, సత్కీర్తి, శ్ఛిన్నసంశయః,॥ 66**

615. స్వక్షః = కమలములవలె అందమైన నేత్రములు కలవాడు.
616. స్వఙ్గః = శుభములగు చక్కని అవయవములు కలవాడు.
617. శతానన్దః = సకల జీవుల యందుండు, అనేకములగు ఆనందములు కలవాడు.
618. నందిః = మిక్కిలి ఆనందముకలవాడు. ఆశ్రితులకు ఆనందమును ఇచ్చువాడు.
619. జ్యోతిర్గణేశ్వరః = వెలుగునిచ్చు సూర్య, చంద్ర, నక్షత్రములకు ప్రభువైనవాడు.
620. విజితాత్మా = ఆత్మను (మనస్సును) జయించినవాడు.
621. అవిధేయాత్మా = సర్వస్వతంత్రుడు. ఇతరులకులోబడనివాడు.
622. సత్కీర్తిః = శాశ్వతమైన యశస్సుకలిగి, వేదములందు సత్యముగ కీర్తింపబడువాడు.



622. ఛిన్నసంశయః = ఎట్టి సందేహములులేనివాడు.

**శ్లో॥ ఉదీర్ణ, స్సర్వతశ్చక్షు, రనీశ, శ్శాశ్వతస్థిరః,।**
**భూశయో, భూషణో, భూతి, ర్విశోక, శ్శోకనాశనః,॥ 67**

624. ఉదీర్ణః = అన్నింటికంటే, అందఱికంటే గొప్పవాడు.
625. సర్వతశ్చక్షుః = తన చైతన్యస్వరూపముతో అన్నింటినిచూచువాడు.
626. అనీశః = తనపైనఎట్టి అధికారులు లేనివాడు.
627. శాశ్వతస్థిరః = ఎన్ని అవతారములెత్తినను, మార్పులేనివాడు.
628. భూశయః = రామావతారమున లంకకుపోవుచు సముద్ర తీరమున దర్భలపై పరుండినవాడు.
629. భూషణః = తన అవతారములతో, లోకములను అలంకరించినవాడు. అన్ని ఆభరణములను ధరించినవాడు.
630. భూతిః = సకల ఐశ్వర్యములు కలవాడు. భక్తులకును కలుగజేయువాడు.
631. విశోకః = దు:ఖము లేనివాడు. ఆనందస్వరూపుడు.
632. శోకనాశనః = తలచినవారికి దు:ఖములను తొలగించువాడు.

**శ్లో॥ అర్చిష్మా, నర్చితః, కుంభో, విశుద్ధాత్మా, విశోధనః,।**
**అనిరుద్ధో, ఽప్రతిరథః, ప్రద్యుమ్నో, ఽ మితవిక్రమః,॥ 68**

633. అర్చిష్మాన్ = 1) సూర్యచంద్రాదులకును కాంతినిచ్చువాడు.
2) తేజోరూపము కలవాడు.
634. అర్చితః = బ్రహ్మాదులచేత పూజింపబడువాడు.
635. కుంభః = కుండలో వస్తువులవలె, తనలో బ్రహ్మాండములు కలవాడు.
636. విశుద్ధాత్మా = త్రిగుణములకు అతీతుడై, శుద్ధమగు ఆత్మ కలవాడు.
637. విశోధనః = స్మరించువారి పాపములను పోగొట్టువాడు.
638. అనిరుద్ధః = శత్రువులచే నిరోధింపబడనివాడు. అనిరుద్ధ వ్యూహరూపుడు.
639. అప్రతిరథః = ప్రతిపక్షము(శత్రువులు) లేనివాడు.
640. ప్రద్యుమ్నః = మిక్కిలి ధనవంతుడు (ప్రద్యుమ్నవ్యూహరూపుడు.)

641. అమితవిక్రమః = సాటిలేని, మేటి విక్రమము కలవాడు.

**శ్లో॥ కాలనేమినిహా, వీర, శ్శౌరి, శ్శూరజనేశ్వరః,।**
**త్రిలోకాత్మా, త్రిలోకేశః, కేశవః, కేశిహా, హరిః,॥ 69**

642. కాలనేమినిహా = 'కాలనేమి'అను రాక్షసుని సంహరించినవాడు.
643. వీరః = దుష్టులగు రాక్షసులనుసంహరించు వీరుడు.
644. శౌరిః = శూరుడనువాని వంశమున పుట్టిన కృష్ణుడు.
645. శూరజనేశ్వరః = శూరులగు ఇంద్రాదులనుకూడా శాసించుప్రభువు.
646. త్రిలోకాత్మా = మూడులోకములందు అంతర్యామియైయుండి, సర్వమును శాసించువాడు.
647. త్రిలోకేశః = మూడులోకములకు ప్రభువై నడుపువాడు.
648. కేశవః = 1.సూర్యాదికిరణములే కేశములుగా కలవాడు. 2.త్రిమూర్తి స్వరూపుడు.
649. కేశిహా = 'కేశి' అనురాక్షసుని సంహరించినవాడు.
650. హరిః = జనన, మరణములతో కూడిన సంసారమును పూర్తిగా నశింపజేయువాడు.

**శ్లో॥ కామదేవః, కామపాలః, కామీ, కాన్తః, కృతాగమః,।**
**అనిర్దేశ్యవపు, ర్విష్ణు, ర్వీరో, ఽ నన్తో, ధనంజయః,॥ 70**

651. కామదేవః = 'ధర్మ, అర్థ, కామ, మోక్షములను, పురుషార్థములను భక్తులగు వారిచే కోరబడు దేవుడు.
652. కామపాలః = భక్తుల కోరికలను కాపాడువాడు.
653. కామీ = కోరికలన్నియు సిద్ధించిన పరిపూర్ణుడు.
654. కాన్తః = సుందరమైన రూపము కలవాడు.
655. కృతాగమః = వేద, వేదాంగములను ప్రవచించి నడుపువాడు.
656. అనిర్దేశ్యవపుః = ఇట్టిది, అట్టిది అని నిరూపించుటకు వీలుకాని దివ్యమైన రూపము కలవాడు.
657. విష్ణుః = భూమి, ఆకాశములందు వ్యాపించిన గొప్ప తేజము కలవాడు.
658. వీరః = గమనము, వ్యాప్తి, జననము, కాంతి భోజనము మొదలగునవి అన్నియు కలవాడు.
659. అనంతః = 1.అంతటా నిండియున్నవాడు కావున, దేశ, కాల, వస్తువులచే విభజించుటకు వీలులేనివాడు. 2. అనేక గుణములు కలవాడు.



660. ధనంజయః = 1.అగ్ని స్వరూపుడు. 2.ధనమును సంపాదించువాడు. 3.అర్జునునిగా ఉన్నవాడు.

**శ్లో॥ బ్రహ్మణ్యో, బ్రహ్మకృ, ద్బ్రహ్మ, బ్రహ్మ, బ్రహ్మవివర్ధనః,।**
**బ్రహ్మవి, ద్బ్రాహ్మణో, బ్రహ్మీ, బ్రహ్మజ్ఞో, బ్రాహ్మణప్రియః,॥ 71**

661. బ్రహ్మణ్యః = బ్రహ్మమని చెప్పబడుచున్న తపస్సు, వేదము, జ్ఞానము అయినవాడు. విప్రులకు మేలు చేయువాడు.
662. బ్రహ్మకృత్ = తపస్సు మొదలైన సత్కర్మలు చేయువాడు.
663. బ్రహ్మ = నాలుగుముఖములుగల బ్రహ్మరూపమున సృష్టిచేయువాడు.
664. బ్రహ్మ = సత్యము, జ్ఞానము, అనంతము అనుగుణములు కలవాడు. సర్వవ్యాపకుడు.
665. బ్రహ్మవివర్ధనః = తపస్సు మొదలగు వానిని వృద్ధి చేయువాడు.
666. బ్రహ్మవిత్ = వేదమును, వేదార్థమును బాగుగా తెలిసినవాడు.
667. బ్రాహ్మణః = వేదవిజ్ఞానమును, తెలియజేయు బ్రాహ్మణుని రూపముననున్నవాడు.
668. బ్రహ్మీ = తపస్సు, వేదము, జ్ఞానము కలవాడు.
669. బ్రహ్మజ్ఞః = తన రూపమైన బ్రహ్మమును, వేదములను తెలిసినవాడు.
670. బ్రాహ్మణప్రియః= బ్రహ్మజ్ఞానులను ప్రేమించువాడు. బ్రహ్మజ్ఞానులచే కోరబడువాడు.

**శ్లో॥ మహాక్రమో, మహాకర్మా, మహాతేజా, మహోరగః,।**
**మహాక్రతు, ర్మహాయజ్వా, మహాయజ్ఞో, మహాహవిః,॥ 72**

671. మహాక్రమః = పెద్దవైన మూడడుగులతో ముల్లోకములను అక్రమించినవాడు. వామనుడు.
672. మహాకర్మా = లోక రక్షణమునకై గొప్ప పనులు చేయువాడు.
673. మహాతేజాః = సూర్యాదులను కూడా ప్రకాశింపజేయు గొప్పతేజము కలవాడు.
674. మహోరగః = గొప్ప సర్పములగు శేష వాసుకి రూపములనున్నవాడు.
675. మహాక్రతుః = అశ్వమేధమను గొప్పయజ్ఞము తానైనవాడు.
676. మహాయజ్వా = లోకకల్యాణమునకై అనేక యజ్ఞములు నిర్వహించు యజమాన స్వరూపుడు.

677. మహాయజ్ఞః = గొప్పదగు (జప)యజ్ఞము కూడ తానైనవాడు.
678. మహాహవిః = యజ్ఞములందు సమర్పింపబడు పురోడాశము మొదలగు హోమద్రవ్యములు తన రూపమైనవాడు.

శ్లో॥ స్తవ్య, స్తవప్రియ, స్తోత్రం, స్తుతిః, స్తోతా, రణప్రియః,।
పూర్ణః, పూరయితా, పుణ్యః, పుణ్యకీర్తి, రనామయః,॥ 73

679. స్తవ్యః = ముక్తినిచ్చుచు, అందరిచే స్తుతింపబడువాడు.
680. స్తవప్రియః = పొగడదగిన కల్యాణ గుణములు కలిగి స్తుతిచేయువారికి సులభముగ ప్రసన్నుడగువాడు.
681. స్తోత్రమ్ = గుణసంకీర్తనమునకు ఉపకరించు 'స్తోత్రము'తానే ఐనవాడు
682. స్తుతిః = స్తుతిచేయు పద్ధతియు ఐనవాడు.
683. స్తోతా = స్తుతించు భక్తునిరూపముననున్నవాడు.
684. రణప్రియః = లోకములను రక్షించుస్వామి, శంఖచక్రాదులను ధరించి యుద్ధమునందు ప్రీతికలవాడు.
685. పూర్ణః = జ్ఞాన, సిద్ధి, శక్తి, సంపదలతో నిండినవాడు.
686. పూరయితా = ఆశ్రితులను సంపదలతో నింపువాడు.
687. పుణ్యః = తలచువారి పాపములను పోగొట్టి పుణ్యములనిచ్చువాడు.
688. పుణ్యకీర్తిః = "స్మరించువారికి శుభములు కలిగించి రక్షించువాడ"ను మంచికీర్తి కలవాడు.
689. అనామయః = కర్మల వలన కలుగు శారీరక, మానసిక బాధలు లేనివాడు.

శ్లో॥ మనోజవ, స్తీర్థకరో, వసురేతా, వసుప్రదః,।
వసుప్రదో, వాసుదేవో, వసు, ర్వసుమనా, హవిః,॥ 74

690. మనోజవః = మనసుతో సమానమైన వేగము కలవాడు.
691. తీర్థకరః = 1. వేదాది 14 విద్యలు బోధించువాడు.
2. గంగాది పుణ్యనదులను ఏర్పాటు చేసినవాడు
692. వసురేతాః = బంగారువంటి తేజము కలవాడు.
693. వసుప్రదః = భక్తులకు సంపదలిచ్చువాడు.
694. వసుప్రదః = కోరిన వారికి మోక్షమునిచ్చువాడు.
695. వాసుదేవః = 1) వసుదేవుని తనయుడైన కృష్ణునిగా అవతరించినవాడు.
2) అంతటా నిండి, ప్రకాశించువాడు



696. వసుః = తనయందు విశ్వము, విశ్వమునందుతాను ఉన్నవాడు.
697. వసుమనాః = అంతటను సమమగుభావము(మనస్సు) కలవాడు.
698. హవిః = యజ్ఞములందు దేవతలకిచ్చు 'ద్రవ్యము' తానైనవాడు.

శ్లో॥ సద్గతి, స్సత్కృతి, స్సత్తా, సద్భూతి, స్సత్పరాయణః,।
శూరసేనో, యదుశ్రేష్ఠ స్సన్నివాస, స్సుయామునః,॥ 75

699. సద్గతిః = 1.సజ్జనులకు చేరదగినవాడు. 2.గొప్పబుద్ధి కలవాడు.
700. సత్కృతిః = జగములకు మేలు గూర్చు మంచి పనులు చేయువాడు.
701. సత్తా = భేదములేక అంతటా నిండియుండువాడు. సర్వమును సమదృష్టితో చూచువాడు.
702. సద్భూతిః = చైతన్య స్వరూపుడై అన్నియు తానైనవాడు.
703. సత్పరాయణః = సజ్జనులకు చేరదగిన వైకుంఠము స్థానమైయున్నవాడు.
704. శూరసేనః = ధర్మమును రక్షించుటకు శూరులైన పరివారము కలవాడు. శూరసేన దేశంలో పుట్టిన కృష్ణుడు.
705. యదుశ్రేష్ఠః = యాదవులలో గొప్పవాడు.
706. సన్నివాసః = మంచివారికి నివాసస్థానమైనవాడు. సజ్జనులలో ఉండువాడు.
707. సుయామునః = యమునానదీ తీరమునందలి నందాదులైన గోపకులతో కలిసియుండువాడు. కృష్ణపరమాత్ముడు.

శ్లో॥ భూతావాసో, వాసుదేవ, స్సర్వాసునిలయో, ఽనలః,।
దర్పహా, దర్పదో, దృప్తో, దుర్ధరో, ఽ థాపరాజితః,॥ 76

708. భూతావాసః = ఆకాశము మొ॥ పంచభూతములకు ఆశ్రయమైనవాడు.
709. వాసుదేవః = జగములన్నింటిని తనమాయచే ఆవరించి యున్నవాడు. అంతటా ఉండువాడు.
710. సర్వాసునిలయః = సకల జీవులకు ప్రాణభూతమై, తుదకు అన్నింటికి చేరదగినవాడు.
711. అనిలః = అనంత తేజోరూపుడై అపరిమిత శక్తి సంపదలు కలవాడు.

712. దర్పహా = దుష్టుల గర్వమును పూర్తిగా అణచువాడు.
713. దర్పదః = సర్మార్గ వర్తనులకు ఆత్మవిశ్వాసమును కలిగించువాడు.
714. దృప్తః = ఎల్లప్పుడు స్వాత్మానందముతో సంతుష్టుడై తన్మయుడై యుండువాడు.
715. దుర్ధరః = సాధనలేనివారికి ధారణచేయుటకు (హృదయమున నిలుపుకొనుటకు) సాధ్యము కానివాడు.
716. అపరాజితః = లోపలి, వెలుపలి శత్రువులచే ఎన్నడును, పరాభవింపబడనివాడు.

**శ్లో॥ విశ్వమూర్తి, ర్మహామూర్తి, ర్దీప్తమూర్తి, రమూర్తిమాన్,।**
**అనేకమూర్తి, రవ్యక్త, శ్శతమూర్తి, శ్శతాననః,॥ 77**

717. విశ్వమూర్తిః = ప్రపంచమే తన రూపముగా గలవాడు.
718. మహామూర్తిః = గొప్ప (అపరిమిత) రూపముగలవాడు.
719. దీప్తమూర్తిః = జ్ఞానముతో ప్రకాశించు (తేజోమయ) రూపము గలవాడు.
720. అమూర్తిమాన్ = కర్మములననుసరించి ఏర్పడిన దేహము లేనివాడు.
721. అనేకమూర్తిః = ధర్మమును నిలబెట్టుటకై ఆ, యా, సమయములలో అనేక రీతుల అవతారములెత్తినవాడు.
722. అవ్యక్తః = ఇంద్రియమనోబుద్ధులకు తెలియనిరూపము గలవాడు.
723. శతమూర్తిః = చైతన్యరూపమై వివిధములగు ఆకారములు తాల్చువాడు.
724. శతాననః = విశ్వరూపుడు కావున, అనేక ముఖములు కలవాడు.

**శ్లో॥ ఏకో, నైక, స్సవః, కః, కిం, యత్త, త్పదమనుత్తమమ్,।**
**లోకబన్ధు, ర్లోకనాథో, మాధవో, భక్తవత్సలః,॥ 78**

725. ఏకః = ప్రపంచమే తానైనందున ఒక్కడుగా గోచరించువాడు. అద్వైత స్వరూపుడు.
726. నైకః = మాయతోకూడి అనేక రూపములుగా ఉన్నవాడు.
727. సవః = సోమముతో కూడిన యజ్ఞమే తన రూపముగా కలవాడు.
728. కః = అనంద స్వరూపుడు. (బ్రహ్మము)
729. కిమ్ = యోగులచే "అతడెవరని" విచారణ చేయదగినవాడు.



730. యత్ = తనంతతానుగా ఏర్పడి, 'ఏదికలదో' అని విచారించి చెప్పబడువాడు.
731. తత్ = ఏది అంతట వ్యాపించి ఉన్నదో 'అది' యైనవాడు.
732. పదమనుత్తమమ్ = ముముక్షులగు వారిచే కోరబడు ఉత్తమ స్థితి కలవాడు. పరబ్రహ్మము.
733. లోకబంధుః = 1) లోకములకు (ఆధారమై) బంధువైనవాడు. 2) రక్షకుడైన తండ్రివంటి చుట్టము.
734. లోకనాథః = లోకములకు ప్రభువు, శాసించువాడు.
735. మాధవః = 1.మధువు(యాదవ) వంశమున పుట్టినవాడు. 2. మౌన, ధ్యాన, యోగములచే తెలియబడువాడు.
736. భక్తవత్సలః = భక్తులయందు మిక్కిలి అనురాగము కలవాడు.

**శ్లో॥ సువర్ణవర్ణో, హేమాంగో, వరాంగ, శ్చందనాంగదీ,।**
**వీరహా, విషమ, శ్శూన్యో, ఘృతాశీ, రచల, శ్చలః,॥ 79**

737. సువర్ణవర్ణః = బంగారమునుబోలు దేహకాంతి కలవాడు.
738. హేమాంగః = సువర్ణమువంటి శరీరావయవములు కలవాడు.
739. వరాంగః = అందమైన శరీర భాగములు కలవాడు.
740. చందనాంగదీ = ఆనందమునిచ్చు చందనాదులు, భుజకీర్తులు, మొ॥లగు ఆభరణములు కలవాడు.
741. వీరహా = ధర్మమును కాపాడుటకై రాక్షసవీరులను సంహరించువాడు.
742. విషమః = శుభలక్షణములతో సాటిలేనితేజముకలవాడు.
743. శూన్యః = గుణదోషములకతీతుడై ఇట్లుండునని నిరూపించుటకు వీలులేనివాడు.
744. ఘృతాశీః = కోరికలు తీరుటచే, పరిపూర్ణుడైనవాడు.
745. అచలః = 1. ఆత్మజ్ఞానమునుండి చలింపనివాడు. 2. విశ్వమంతయు నిండి కదలనివాడు.
746. చలః = ఉపాధిగతుడై జీవులలో వాయురూపమున నెల్లప్పుడు చలించువాడు.

**శ్లో॥ అమానీ, మానదో, మాన్యో, లోకస్వామీ, త్రిలోకధృత్(క్),।**
**సుమేధా, మేధజో, ధన్య, స్సత్యమేధా, ధరాధరః,॥ 80**

747. అమానీ = లోకమునందలి అభిమాన, గౌరవములకు
748. మానదః = మానవులకు గౌరవము నిచ్చువాడు.
749. మాన్యః = ఉత్తమ గుణములచే గౌరవింపబడెడువాడు.
750. లోకస్వామీ = 14 భువనములకు అధిపతియైనవాడు.
751. త్రిలోకధృత్ = మూడులోకములను ధరించువాడు.
752. సుమేధాః = శుభకరములగు విశేషమైన తెలివితేటలు గలవాడు.
753. మేధజః = యజ్ఞములందు ఆవిర్భవించువాడు.
754. ధన్యః = నిత్యముక్తుడై కృతార్థుడైనవాడు. తాను తలచినది నెరవేర్చుకొనువాడు.
755.. సత్యమేధాః = నిత్యమగు ఆత్మజ్ఞాన రూపమైనప్రజ్ఞకలవాడు.
756. ధరాధరః = ఆదిశేషుడు మొదలగు అంశలతో భూమిని ధరించువాడు.

**శ్లో॥ తేజోవృషో, ద్యుతిధర, స్సర్వశస్త్రభృతాంవరః,।**
**ప్రగ్రహో, నిగ్రహో, వ్యగ్రో, నైకశృంగో, గదాగ్రజః,॥ 81**

757. తేజోవృషః = ఎల్లప్పుడు సూర్యుని రూపములో నుండి నీటిని వర్షించువాడు.
758. ద్యుతిధరః = ఆనందమునిచ్చు శరీరకాంతిని ధరించువాడు.
759. సర్వశస్త్రభృతాంవరః = ఆయుధములను ధరించిన శూరులందరిలో నుత్తముడు.
760. ప్రగ్రహః = 1. భక్తితో నొసగు పుష్ప పత్రాదికము గ్రహించువాడు. 2. ఇంద్రియాశ్వములను పట్టియుంచెడువాడు. విజయసారథి.
761. నిగ్రహః = జగము సమస్తమును నిగ్రహించువాడు. జీవులలో గల అహంకారమును పోగొట్టువాడు.
762. వ్యగ్రః = 1. భక్తులను కాపాడుటలో ఆసక్తి గలవాడు.
2. ఇంద్రియాశ్వములను పట్టియుంచెడివాడు.
763. నైకశృఙ్గః = 1.అనేక శిఖరములుగల హమవంతుడు.
2.చతుర్వేద స్వరూపుడు. శబ్ద బ్రహ్మము.
764. గదాగ్రజః = 1. మంత్రములనుండి ముందుగా పుట్టినవాడు.
2. కృష్ణావతారమున గదుడనువానికి అన్నగా పుట్టినవాడు.

**శ్లో॥ చతుర్మూర్తి, శ్చతుర్బాహు, శ్చతుర్వ్యూహ, శ్చతుర్గతిః,।**
**చతురాత్మా, చతుర్భావ, శ్చతుర్వేదవి, దేకపాత్,॥ 82**



765. చతుర్మూర్తిః = 1.విశ్వ,తైజస, ప్రాజ్ఞ, చైతన్యములనెడి నాల్గు రూపములు కలవాడు. 2.బలభద్ర, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, రూపములు కలవాడు.
766. చతుర్బాహుః = నాలుగు భుజములు కలవాడు. వసుదేవ పుత్రుడు.
767. చతుర్వ్యూహః = శరీర పురుషుడు, ఛందోపురుషుడు, వేదపురుషుడు, మహాపురుషుడు అను నాలుగు రూపములు, తనను తెలుసుకొను పద్ధతులుగా కలవాడు.
768. చతుర్గతిః = తమతమ ధర్మములను నిర్వర్తించు నాలుగు ఆశ్రమములవారికి (వర్ణములవారికి) ఆశ్రయింపదగినవాడు.
769. చతురాత్మా = 1.రాగద్వేషాదులులేని, సమర్ధమైన ఆత్మ కలవాడు.
2. మనో, బుద్ధి, చిత్త, అహంకారములనెడి నాలుగు అంతఃకరణములు తనకు ఆశ్రయములుగా కలవాడు.
770. చతుర్భావః = ధర్మ, అర్ధ, కామ, మోక్షములనెడి నాలుగు పురుషార్ధములకు మూలమైనవాడు.
771. చతుర్వేదవిత్ = నాలుగు వేదములు బాగుగా తెలిసినవాడు.
772. ఏకపాత్ = ఈ జగత్తంతయు తనలో(1/4) ఒకపాదము(భాగము) గా ఉన్నవాడు.

**శ్లో॥ సమావర్తో, ఽ నివృత్తాత్మా, దుర్జయో, దురతిక్రమః,।**
**దుర్లభో, దుర్గమో, దుర్గో, దురావాసో, దురారిహా,॥ 83**

773. సమావర్తః = సంసార చక్రమును చక్కగాత్రిప్పువాడు.
774. అనివృత్తాత్మా = 1. వెనుదిరుగని స్వభావము కలవాడు.
2. అంతటా నిండియుండు స్వరూపము కలవాడు.
775. దుర్జయః = ఇతరులకు జయింప శక్యము కానివాడు.
776. దురతిక్రమః = చంద్ర సూర్యాదులకు కూడ దాటరాని ఆజ్ఞ కలవాడు.
777. దుర్లభః = 1.సంసారులకు పొందశక్యము కానివాడు. పుణ్యఫలమగు భక్తికి మాత్రమే లోబడువాడు.
778. దుర్గమః = చేరుటకు సాధ్యముకానివాడు. గొప్ప ప్రయత్నముచే మాత్రమేచేరదగినవాడు.

779. దుర్గః = సాధనలో విఘ్నములు దాటినవారిచే పొందదగినవాడు.

780. దురావాసః = యోగులు మాత్రమే హృదయమున నిలుపుకొనుటకు సాధ్యమైనవాడు.

781. దురారిహా = దుష్టులైన రాక్షసులను సంహరించువాడు.

**శ్లో॥ శుభాంగో, లోకసారంగ, స్సుతన్తు, స్తన్తువర్ధనః,।**
**ఇన్ద్రకర్మా, మహాకర్మా, కృతకర్మా, కృతాగమః,॥ 84**

782. శుభాంగః = మంగళకరములగు అవయవములతో ధ్యానింపదగినవాడు.

783. లోకసారంగః = 1. పూవులలోని తేనెను గ్రహించు తుమ్మెదవలె లోక సారమును గ్రహించువాడు.
2. ఉత్తమమగు ప్రణవముచే ఉపాసింపదగినవాడు.

784. సుతన్తుః = విశాలము, సుందరమగు ప్రపంచమును సృష్టించువాడు.

785. తన్తువర్ధనః = 1. ఆ ప్రపంచమును వృద్ధి పొందించువాడు.
2. ఉపసంహరించువాడు.

786. ఇన్ద్రకర్మా = ఇంద్రునిరూపమున లోకపరిపాలనము చేయుచు, శుభప్రదములగు కర్మలనాచరించువాడు.

787. మహాకర్మా = అద్భుతములగు సృష్టి, స్థితి, లయములు నిర్వహించువాడు.

788. కృతకర్మా = ఆచరింపదగిన కర్మములన్నియు ఆచరించినవాడు. కృతార్థుడు.

789. కృతాగమః = ధర్మమూలములగు వేదములు అందజేసినవాడు.

**శ్లో॥ ఉద్భవ, స్సుందర, స్సుందో, రత్ననాభ, స్సులోచనః,।**
**అర్కో, వాజసన, శృంగీ, జయంత, స్సర్వవిజ్జయీ,॥ 85**

790. ఉద్భవః = తన ఇష్టప్రకారము ఉత్తమమైన జన్మము పొందువాడు.

791. సున్దరః = మిక్కిలి(సౌభాగ్యము) అందము కలవాడు.

792. సున్దః = కరుణారససముద్రుడు. శాంతిని ప్రసాదించువాడు.

793. రత్ననాభః = రత్నమువలె అందమైన నాభికలవాడు.



794. సులోచనః = అందమైన కన్నులు కలవాడు. జ్ఞానము కలవాడు.

795. అర్కః = పూజనీయులగు బ్రహ్మాదులచేతను, పూజింపబడువాడు.

796. వాజసనః = జీవులకు అన్నపానములిచ్చువాడు.

797. శృంగీ = మత్స్యరూపమునను, వరాహరూపమునను కొమ్ములు ధరించువాడు.

798. జయన్తః = శత్రువులను సులభముగా జయించువాడు. జయమునకు కారణమైనవాడు.

799. సర్వవిజ్జయీ = లోపలి, వెలుపలి శత్రువులనందరిని జయించువాడు.

**శ్లో॥ సువర్ణబిందు రక్షోభ్య, స్సర్వవాగీశ్వరేశ్వరః,।**
**మహాహ్రదో, మహాగర్తో, మహాభూతో, మహానిధిః,॥ 86**

800. సువర్ణబిందుః = బంగారువంటి శరీరభాగములు కలవాడు.

801. అక్షోభ్యః = రాగద్వేషాదులచేతను, శబ్దాది విషయములచేతను, రాక్షసులచేతను బాధనొందనివాడు.

802. సర్వవాగీశ్వరేశ్వరః = అన్నియు తెలిసిన బ్రహ్మాదులకును ప్రభువు

803. మహాహ్రదః = యోగులకు ఆనందము నిచ్చు ఆనందసరస్సు.

804. మహాగర్తః = దాటరాని మాయా శక్తి కలవాడు. యుద్ధములందు గొప్ప రథముగల వీరుడు.

805. మహాభూతః = 1. మూడు కాలములందు సత్యమై స్థిరముగా ఉండువాడు.

806. మహానిధిః = గొప్ప నిధియై పంచభూతములకు ఆధారమైనవాడు.

**శ్లో॥ కుముదః, కున్దరః, కుందః, పర్జన్యః, పావనో౽నిలః॥**
**అమృతాశో, ౽మృతవపు, సర్వజ్ఞ, స్సర్వతోముఖః,॥ 87**

807. కుముదః = భూదేవికి సంతోషము కగించువాడు.

808. కున్దరః = మల్లెపూలవంటి నిర్మల కర్మఫలములనిచ్చువాడు. వరాహరూపమున భూమిని పెకలించినవాడు.

809. కుందః = 1. మల్లెపూలవంటి కోమలములగు అందమైన అవయవములు కలవాడు. 2. భూమిని కశ్యపునకు దానమిచ్చిన పరశురాముడు. 3. రాజులననేక పర్యాయములు సంహరించినవాడు.

810. పర్జన్యః = 1. మేఘమువలె తాపత్రయములను శమింపజేయువాడు. 2. కర్మఫలములను వర్షించువాడు.

811. పావనః = తలచువారిని పవిత్రులనుచేసి, తరింపజేయువాడు.
812. అనిలః = ఎల్లప్పుడు ఆత్మజ్ఞానముతో జాగరూకుడై యుండువాడు. భక్తసులభుడు.
813. అమృతాశః = 1.దేవతలకు అమృతమును పంచి, తానును త్రావినవాడు. 2.ఆత్మానన్దామృతమును అనుభవించువాడు.
814. అమృతవపుః = అమృతమయమైన స్వరూప స్వభావములు కలవాడు.
815. సర్వజ్ఞః = సకల జీవస్వరూపుడై అన్ని విషయములు బాగుగా తెలిసినవాడు.
816. సర్వతోముఖః = విశ్వరూపుడై అన్నివైపుల ముఖములు కలవాడు.

**శ్లో॥ సులభ, స్సువ్రత, స్సిద్ధ, శ్శత్రుజి, చ్ఛత్రుతాపనః,।**
**న్యగ్రోధో, దుమ్బరో, ఽ శ్వత్థ, శ్చాణూరాంధ్రనిషూదనః,॥ 88**

817. సులభః = భక్తులొసగు పత్రపుష్పాదికముల చేతనే ప్రసన్నుడగువాడు.
818. సువ్రతః = 'శరణాగత రక్షణమ'ను వ్రతమును పాటించువాడు.
819. సిద్ధః = పరాధీనముకాని కార్యసిద్ధి కలవాడు.
820. శత్రుజిత్ = సాధువులను, ధర్మమును బాధించు రాక్షసాది దుష్ట శత్రువులను జయించువాడు.
821. శత్రుతాపనః = దేవ విరోధులను తపింపజేయువాడు.
822. న్యగ్రోధః = 1) అందరికంటె అధికుడైనవాడు. 2) మాయను నిరోధించువాడు.
823. ఉదుంబరః = ఆకాశముకంటె గొప్పవాడు. అన్నముద్వారా జగములను పోషించువాడు.
824. అశ్వత్థః = రావిఆకువలె చంచలమైన సంసారవృక్షమును తెలియజేయువాడు.
825. చాణూరాంధ్ర నిషూదనః = చాణూరుడను మల్లయోధుని సంహరించినవాడు.

**శ్లో॥ సహస్రార్చి, స్సప్త జిహ్వ, స్సప్తైధా, స్సప్తవాహనః,।**
**అమూర్తి, రనఘో, ఽ చిన్త్యో, భయకృ, ద్భయనాశనః,॥ 89**

826. సహస్రార్చిః = అనంతకిరణములు కలవాడు. కోటిసూర్య ప్రభాభాసమానుడు.
827. సప్తజిహ్వః = ఏడు నాల్కలుగల అగ్నిస్వరూపుడు.



828. సప్తైధా = ఏడు సమిధలద్వార, ఏడు కాంతులు కలవాడు.
829. సప్తవాహనః = 1) ఏడు గుఱ్ఱములు వాహనములుగాగలసూర్యుడు 2) 'సప్త' అనుగుఱ్ఱము వాహనముగా కలవాడు
830. అమూర్తిః = 1.ఆకారముగల ప్రపంచమునకు అతీతుడు 2.శరీరములేనివాడు.
831. అనఘః = పాపము, పాపఫలమగు దుఃఖములేనివాడు.
832. అచింత్యః = 1.సాక్షిమాత్రుడు 2.మనోబుద్ధులచేత ఊహించుటకు వీలులేనివాడు.
833. భయకృత్ = దుష్టులకు భయమును కలిగించువాడు.
834. భయనాశనః = సజ్జనులకు భయమును తొలగించువాడు.

**శ్లో॥ అణు, ర్బృహ, త్కృశ, స్స్థూలో, గుణభృ, న్నిర్గుణో, మహాన్,।**
**అధృత, స్స్వధృత, స్స్వాస్యః, ప్రాగ్వంశో, వంశవర్ధనః,॥ 90**

835. అణుః = అణువువలె మిక్కిలి సూక్ష్మమైనవాడు.
836. బృహత్ = అంతటా వ్యాపించిన పెద్దరూపముకలవాడు.
837. కృశః = సన్నని శరీరముకలవాడు.
838. స్థూలః = గొప్ప ఆకారము కలవాడు.
839. గుణభృత్ = జగద్వ్యవహారమునకై త్రిగుణములు కలవాడు.
840. నిర్గుణః = నిజమునకు ఎట్టి గుణసంగమము లేనివాడు.
841. మహాన్ = జ్ఞానము, ఆనందము స్వరూపముగా కలిగి, అందరికంటె గొప్పవాడు.
842. అధృతః = ఇతరులచే ధరింపబడనివాడు.
843. స్వధృతః = తనకుతానే ఆధారమైనవాడు. సర్వతంత్రస్వతంత్రుడు.
844. స్వాస్యః = వేద సమూహమును వెలువరించిన సుందరమైన ముఖము కలవాడు.
845. ప్రాగ్వంశః = సృష్టికి పూర్వమునందున్నవాడు.
846. వంశవర్ధనః = 'విశ్వమ'ను తనవంశమును వృద్ధి పొందించువాడు.

**శ్లో॥ భారభృ, త్కథితో, యోగీ, యోగీశ, స్సర్వకామదః,।**
**ఆశ్రమ, శ్శ్రమణః, క్షామ, స్సుపర్ణో, వాయువాహనః,॥ 91**

847. భారభృత్ = ఆదిశేషుని రూపమున భూమిని మోయువాడు.
848. కథితః = వేదశాస్త్రములంతట ఉన్నతుడని చెప్పబడినవాడు.
849. యోగీ = సంకల్ప వికల్పములు లేని జ్ఞానముచే తెలియబడువాడు.

850. యోగీశః = అన్తరాయములు లేని యోగసిద్ధికలిగి, యోగులందఱియందు అధికుడైనవాడు.
851. సర్వకామదః = అన్ని(కోరికలు) కర్మఫలములనిచ్చువాడు.
852. ఆశ్రమః = ఆశ్రయించినవారికి సంసార దుఃఖమును తొలగించువాడు.
853. శ్రమణః = 1) దుష్టులను శిక్షించువాడు. 2) కోరికలు లేని సంన్యాసి.
854. క్షామః = ప్రళయకాలమున జీవులందఱిని నశింప జేయువాడు.
855. సుపర్ణః = విశ్వవృక్షమైన తనకు వేదములు ఆకులుగా గలవాడు.
856. వాయువాహనః = గాలి వీచుటకు కారణభూతమైనశక్తిగలవాడు.

**శ్లో॥ ధనుర్ధరో, ధనుర్వేదో, దండో, దమయితా, దమః,।**
**అపరాజిత, స్సర్వసహో, నియన్తా, ఉ నియమో, ఉ యమః,॥ 92**

857. ధనుర్ధరః = రామావతారమున కోదండమును ధరించినవాడు.
858. ధనుర్వేదః = ధనుర్విద్య సమగ్రముగ తెలిసినవాడు. ప్రణవము ద్వారా తెలియదగినవాడు.
859. దండః = తప్పుచేసినవారిని దండించు దండ(చట్టము)మైనవాడు.
860. దమయితా = దుష్టులను శిక్షించువాడు. (యముడు, రాజు)
861. దమః = దండించుటవలన కలుగు ఇంద్రియ నిగ్రహరూపమైనవాడు.
862. అపరాజితః = శత్రువులచేతిలో ఓటమినెఱుగనివాడు.
863. సర్వసహః = అన్ని పనులు నిర్వహించుటయందు సమర్థుడు. శత్రువులను జయించువాడు.
864. నియంతా = భూతాదులను వారిపరిధి దాటకుండా వారివారి పనులయందు ప్రవర్తింపజేయువాడు.
865. అనియమః = తనకు ఎట్టి ప్రవర్తనా నియమావళిలేక స్వతంత్రముగ ప్రవర్తించువాడు.
నియమః = దేవతాదులను అందఱిని నియమించువాడు.
866. యమః = యముని రూపమున జీవులను దండించువాడు.
అయమః = జననమే లేని భగవంతునకు, మరణభయమునులేదు-మృత్యుభయములేనివాడు.



**శ్లో॥ సత్త్వవా, న్సాత్త్విక, స్సత్య, స్సత్యధర్మపరాయణః,।**
**అభిప్రాయః, ప్రియార్హో ఉ ర్హః, ప్రియకృ, త్ప్రీతివర్ధనః,॥ 93**

867. సత్త్వవాన్ = (సత్త్వము=బలము) మిక్కిలి బలపరాక్రమములు కలవాడు.
868. సాత్త్వికః = సత్త్వగుణముకలవాడు. (సత్త్వము=జ్ఞానము)
869. సత్యః = త్రికాలములయందు మార్పులేనివాడు-మంచివారికి మేలుచేయువాడు.
870. సత్యధర్మపరాయణః = సత్యధర్మములందు అనురక్తి కలవాడు.
871. అభిప్రాయః = 1. ప్రళయకాలమున జగత్తును తనలో చేర్చుకొనువాడు. 2. ముక్తి స్వరూపుడై, ముముక్షువులచే కోరబడువాడు.
872. ప్రియార్హః = భక్తులప్రేమకు పాత్రుడైనవాడు.
873. అర్హః = ఉపచారములచే అర్చింపదగినవాడు.
874. ప్రియకృత్ = ఆశ్రితులకు యోగక్షేమములు కూర్చువాడు.
875. ప్రీతివర్ధనః = 1. భక్తులకు తనపై ప్రేమను వృద్ధి పొందించువాడు. 2. సజ్జనులైనవారిపై తన ప్రేమను ప్రకటించి వారి సంతోషమును పెంపొందించువాడు.

**శ్లో॥ విహాయసగతి, ర్జ్యోతిః, స్సురుచి, ర్హుతభు, గ్విభుః,॥**
**రవి, ర్విరోచన, స్సూర్య, స్సవితా, రవిలోచనః,॥ 94**

876. విహాయసగతిః = 1) సూర్యునిరూపమున ఆకాశమునందు సంచరించువాడు. 2) త్రివిక్రమ రూపమున ఆకాశమును కప్పివేసినవాడు.
877. జ్యోతిః = తన ప్రకాశముచేత సర్వమును వెలిగింపజేయువాడు.
878. సురుచిః = శుభకరమగు కాంతి(ఆలోచనలు) కలవాడు.
879. హుతభుక్ = యజ్ఞములందలి హవిస్సులను భుజించువాడు. తక్కిన దేవతలచే భుజింపచేయువాడు.
880. విభుః = అంతట నిండియుండువాడు. లోకమున్నింటికి ప్రభువు.
881. రవిః = సూర్యునిరూపమున తపింపజేయువాడు, జలములను వర్షింపజేయువాడు.
882. విరోచనః = అనేక విధముల ప్రకాశించువాడు. లోకములను అనుగ్రహించువాడు.
883. సూర్యః = ప్రాణశక్తిని, శోభను, సంపదలను ప్రసాదించువాడు.
884. సవితా = సకల జగముల పుట్టుకకు కారణమైనవాడు.

885. రవిలోచనః = సూర్యుడు తన నేత్రముగా కలవాడు.

**శ్లో॥ అనన్తో, హుతభు, గ్భోక్తా, సుఖదో, నైకజో, ఉగ్రజః,।**
**అనిర్విణ్ణ, స్సదామర్షీ, లోకాధిష్ఠాన, మద్భుతః,॥ 95**

886. అనన్తః = 1.దేశ,కాలములచేత విభజింపబడని శాశ్వతుడు.
887. హుతభుక్ = యజ్ఞములయందు ఆయాదేవతారూపములతో హోమద్రవ్యములనుభుజించువాడు.
888. భోక్తా = లోకములనుపాలించువాడు. అనుభవించువాడు.
889. సుఖదః = భక్తులకు సుఖములను, మోక్షమునిచ్చువాడు.
అసుఖదః = దుఃఖములను దూరముచేయువాడు.
890. నైకజః = ధర్మమును రక్షించుటకై అనేకరూపములలో అవతరించినవాడు.
891. అగ్రజః = సృష్టికి ముందే పుట్టిన హిరణ్యగర్భస్వరూపుడు.
892. అనిర్విణ్ణః = ఆప్తకాముడై పూర్ణుడై దుఃఖము లేనివాడు.
893. సదామర్షీ = భక్తులయెడ క్షమాగుణము కలవాడు.
894. లోకాధిష్ఠానమ్ = మూడులోకములకు ఆధారమైనవాడు.
895. అద్భుతః = రూప, గుణ, శక్తి, ప్రవర్తనాది కార్యములచేత ఆశ్చర్యమును కలిగించువాడు.

**శ్లో॥ సనా, త్సనాతనతమః, కపిలః, కపి, రవ్యయః,।**
**స్వస్తిద, స్స్వస్తికృ, త్స్వస్తి, స్వస్తిభు, క్స్వస్తిదక్షిణః,॥ 96**

896. సనాత్ = ప్రాచీనుడు, చిరకాలమునుండి మార్పులేనివాడు.
897. సనాతనతమః = సనాతనులగు బ్రహ్మాదులకు ముందున్నవాడు.
898. కపిలః = 1.కపిలవర్ణముగల బడబానలమును పోలినవాడు. 2.కపిల మహర్షియైనవాడు.
899. కపిః = కిరణములతో నీటినిపీల్చు సూర్యుని రూపమైనవాడు.
900. అప్యయః = ప్రళయమునందు లోకములన్నింటిని తనలో చేర్చుకొనువాడు.
901. స్వస్తిదః = భక్తులకు శుభములను కలిగించువాడు.
902. స్వస్తికృత్ = శుభకర్మముల నాచరించువాడు.
903. స్వస్తి = శుభమైన స్వరూప, స్వభావములు కలవాడు.
904. స్వస్తిభుక్ = ఆనందరూపమగు శుభముల ననుభవించువాడు. భక్తులశుభములను కాపాడువాడు.



905. స్వస్తిదక్షిణః = స్మరణమాత్రముననే శుభములనొసగుటకు సమర్థుడైనవాడు.

**శ్లో॥ అరౌద్రః, కుండలీ, చక్రీ, విక్ర, మ్యూర్జితశాసనః,।**
**శబ్దాతిగ, శ్శబ్దసహ,శ్శిశిర, శ్శర్వరీకరః,॥ 97**

906. అరౌద్రః = భయంకరములగు రాగ క్రోధములులేని,శుభ కర్మములు కలవాడు.
907. కుండలీ = 1.జ్ఞాన, కర్మములను, మకరకుండలములు (కర్ణాభరణములు) ధరించువాడు. 2.చుట్టచుట్టుకొనియుండు ఆదిశేషుని రూపమైనవాడు.
908. చక్రీ = సుదర్శనమను చక్రమును ధరించువాడు.
909. విక్రమీ = 1.శూరుడు. 2.పాదముచే ఆకాశమును ఆక్రమించువాడు.
910. ఊర్జితశాసనః = శ్రుతిస్మృతిరూపములగు దాటరాని ఆజ్ఞలు కలవాడు.
911. శబ్దాతిగః = మాటలతో వర్ణింపనలవికాని మహత్వము కలవాడు.
912. శబ్దసహః = శబ్దప్రధానమగు వేదస్వరూపుడు. వేదవైద్యుడు.
913. శశిరః = ఆశ్రితుల తాపత్రయమును తొలగించుటలో శిశిరమువలె చల్లనివాడు.
914. శర్వరీకరః = 1.సాధకులకు జ్ఞానము, సంసారులకు అజ్ఞానము అను రాత్రిని కలిగించువాడు. 2.రాత్రివేళలందు చంద్రుని రూపమున చల్లదనమునిచ్చువాడు.

**శ్లో॥ అక్రూరః, పేశలో, దక్షో, దక్షిణః, క్షమిణాంవరః,।**
**విద్వత్తమో, వీతభయః, పుణ్యశ్రవణకీర్తనః,॥ 98**

915. అక్రూరః = ఎవరియెడ అపకారముతలపెట్టునట్టి కోపములేనివాడు.
916. పేశలః = నిర్మలమగు మనో, వాక్కాయకర్మలయందు సౌందర్యము కలవాడు.

917. దక్షః = సకల కర్మములయందును నేర్పు కలవాడు.
918. దక్షిణః = భక్తులను కాపాడుటలో సామర్థ్యము కలవాడు.
919. క్షమిణాంవరః = ఓర్పుకలిగిన వారిలో ఉత్తముడు.
920. విద్వత్తమః = సర్వజ్ఞుడై, అన్నిరంగములయందును ఉన్నతుడైనవాడు.
921. వీతభయః = సంసారభయరహితుడై, భక్తులభయమును పోగొట్టువాడు.
922. పుణ్యశ్రవణకీర్తనః = తన గుణములను కీర్తించువారికి, వినువారికి శుభములను ప్రసాదించువాడు.

**శ్లో॥ ఉత్తారణో, దుష్కృతిహా, పుణ్యో, దుస్స్వప్ననాశనః,।**
**వీరహా, రక్షణ, స్సన్తో, జీవనః, పర్యవస్థితః,॥ 99**

923. ఉత్తారణః = సంసార సముద్రమునుండి భక్తులను ఉద్ధరించువాడు.
924. దుష్కృతిహా = పాపములను, పాపకర్ములను నశింప జేయువాడు.
925. పుణ్యః = స్మరించువారికి పుణ్యమునిచ్చువాడు. వేద శాస్త్రాదులచే పుణ్యము బోధించువాడు.
926. దుఃస్వప్ననాశనః = కీడును సూచించు పీడకలలను పోగొట్టువాడు.
927. వీరహా = భక్తులసాంసారిక బాధలను తొలగించి ముక్తిని ప్రసాదించువాడు.
928. రక్షణః = సత్త్వగుణము కలిగిముల్లోకములను రక్షించువాడు.
929. సన్తః = సజ్జనులయందు విద్యా, వినయములను వృద్ధి పొందించువాడు.
930. జీవనః = ప్రాణవాయువురూపమున జీవులను బ్రతికింప జేయువాడు.
931. పర్యవస్థితః = లోకములందంతట వ్యాపించియున్నవాడు.

**శ్లో॥ అనన్తరూపో, ఉనన్తశ్రీ, ర్జితమన్యు, ర్భయాపహః,।**
**చతురశ్రో, గభీరాత్మా, విదిశో, వ్యాదిశో, దిశః,॥ 100**

932. అనన్తరూపః = అనేకరూపములుగానున్నవాడు. గో, గోప, వత్సముల రూపములతో వెలసినవాడు. (కృష్ణుడు)
933. అనన్తశ్రీ = అపరిమితశక్తి, సంపదలు కలవాడు.



934. జితమన్యుః = క్రోధమును జయించినవాడు. భక్తులక్రోధమును నశింపజేయువాడు.
935. భయాపహః = భక్తుల సంసార భయమును పోగొట్టువాడు.
936. చతురశ్రః = 1.కర్మఫలములు ప్రసాదించువాడు.
2.చతురస్రాకారమగు హోమకుండము నందు ఉద్భవించువాడు.
937. గభీరాత్మా = లోతుతెలియని, అంతుచిక్కని సముద్రమువలె గంభీరమైన హృదయము కలవాడు.
938. విదిశః = విశేషముగా జీవులకు వారి వారి కర్మలననుసరించి ఆయా ఫలములనొసగువాడు.
939. వ్యాదిశః = ఇంద్రాదులగు దేవతలను ఆజ్ఞాపించువాడు.
940. దిశః = వేదములద్వారా కర్మఫలములను తెలియజేయువాడు.

**శ్లో॥ అనాది, ర్భూర్భువో, లక్ష్మీ, స్సువీరో, రుచిరాంగదః,।**
**జననో, జనజన్మాది, ర్భీమో, భీమపరాక్రమః,॥ 101**

941. అనాదిః = సకలలోకములకు, కారణమైన తనకు ఆదియు వేరొక ఆధారము లేనివాడు. స్వతంత్రుడు.
942. భూర్భువః = సర్వభూతములకు ఆశ్రయమైన భూమికి కూడా ఆధారమైనవాడు.
943. లక్ష్మీః = ఆత్మవిద్యాస్వరూపడై ప్రకాశించువాడు. లోకములను ప్రకాశింపజేయువాడు.
భూర్భువోలక్ష్మీః = భూమి-ఆకాశములకు రెండింటికి అలంకారమై శోభనిచ్చువాడు.
944. సువీరః = గొప్పవీరుడు. తనను చేరుటకు శుభప్రదములైన మార్గములు కలవాడు.
945. రుచిరాంగదః = అందమైన భుజకీర్తులు కలవాడు. ఆశ్రితులను సమర్థతో రక్షించువాడు.
946. జననః = జీవులను పుట్టించువాడు.
947. జనజన్మాదిః = జీవుల పుట్టుకకు ఆదికారణమైనవాడు.
948. భీమః = అధర్మపరుల హృదయములలో భయమును కల్గించువాడు.

949. భీమ పరాక్రమః = దుష్టరాక్షస సంహారాదులందు భయంకరమగు పరాక్రమమును ప్రదర్శించువాడు.

శ్లో॥ ఆధారనిలయో, ఉ ధాతా, పుష్పహాసః, ప్రజాగరః,।
ఊర్ధ్వగ, స్సత్పథాచారః, ప్రాణదః, ప్రణవః, పణః,॥ 102

950. ఆధారనిలయః = సృష్టిలోగల, సకల భూతములకు ఆధారమైనవాడు.

951. అధాతా = రక్షణకొఱకై ఇతరులపై ఆధారపడనివాడు.

ధాతా = లోకములన్నింటిని ధరించువాడు. ప్రళయకాలమున సర్వమును తనలో చేర్చుకొనువాడు.

952. పుష్పహాసః = మొగ్గ, పువ్వుగా వికసించినట్లు, తానేవిశ్వముగా పరిణమించినవాడు.

953. ప్రజాగరః = జ్ఞానస్వరూపుడై ఎల్లప్పుడు జాగరూకుడై యుండువాడు.

954. ఊర్ధ్వగః = సర్వోన్నత స్థితియందున్నవాడు. ఉత్తమమైన ముక్తి మార్గమును చూపువాడు.

955. సత్పథాచారః = మంచివారి మార్గమున సంచరించువాడు. రామాది అవతారములందు ఆదర్శ జీవన విధానము కలవాడు.

956. ప్రాణదః = ప్రాణములను ఇచ్చువాడు. కృష్ణావతారమున, గురుపుత్రుడు, పరీక్షిత్తు మొ॥ వారికి ప్రాణములిచ్చి కాపాడినవాడు.

957. ప్రణవః = ఓంకార స్వరూపుడు. ప్రణవ శబ్దముచే వివరింపబడినవాడు. ధ్యానింపదగినవాడు.

958. పణః = 1.విశ్వమునందు నామరూపములను ఏర్పరచి ప్రజలకొసగినవాడు. 2.జీవుల కర్మలను గ్రహించి, తగిన ఫలములను ఇచ్చువాడు.

శ్లో॥ ప్రమాణం, ప్రాణనిలయః, ప్రాణభృ, త్ప్రాణజీవనః,।
తత్త్వం, తత్త్వవి, దేకాత్మా, జన్మమృత్యుజరాతిగః,॥ 103

959. ప్రమాణమ్ = సత్యజ్ఞానములతో, తనకుతానే ప్రమాణమై వేదములచే నిరూపింపబడినవాడు.

960. ప్రాణనిలయః = జీవులందు ప్రాణరూపమైయుండి, చివరకు అవి చేరదగినవాడు. (ఉ॥శిశుపాలుని తేజమును తుదకు కృష్ణునియందే చేరెను.)



961. ప్రాణభృత్ = అన్నోదకముల ద్వారా ప్రాణులను పోషించువాడు.

962. ప్రాణజీవనః = ప్రాణాపానాదులతో జీవులను బ్రతికించువాడు.

963. తత్త్వమ్ = తత్‌శబ్దముచే చెప్పబడువాడు. పరబ్రహ్మ స్వరూపుడు.

964. తత్త్వవిత్ = తనరూపమైన బ్రహ్మము(తత్త్వము)ను తెలిసినవాడు.

965. ఏకాత్మా = ఏకమై,అద్వితీయమైన సర్వవ్యాపకరూపము కలవాడు.

966. జన్మమృత్యుజరాతిగః = పుట్టుట, ఉండుట, పెరుగుట, మార్పుచెందుట, కృశించుట, నశించుట మొదలగు ఆరు వికారములకు లోనుకానివాడు. నిత్యుడు.

శ్లో॥ భూర్భువస్స్వస్తరు, స్తార, స్సవితా, ప్రపితామహః,।
యజ్ఞో, యజ్ఞపతి, ర్యజ్వా, యజ్ఞాంగో యజ్ఞవాహనః,॥ 104

967. భూర్భువస్స్వస్తరుః = వేదసారములైన భూః, భువః, స్వః, అనుశాఖలుగల సంసార వృక్షరూపుడై లోకములందు ప్రకాశించువాడు. విశ్వరూపుడు.

968. తారః = సంసారసముద్రమును తరింపజేయువాడు.

969. సవితా = సకలలోకములను సృష్టించి, తండ్రివలె రక్షించువాడు.

970. ప్రపితామహః = పితామహుడైన బ్రహ్మకు కూడా తండ్రియైనవాడు.

971. యజ్ఞః = యజ్ఞస్వరూపుడు.

972. యజ్ఞపతిః = అధిపతియై యజ్ఞమును రక్షించువాడు.

973. యజ్వా = యజమానియై యజ్ఞము చేయువాడు. చేయించువాడు.

974. యజ్ఞాంగః = యజ్ఞములందుపయోగించు, మంత్రములు, అగ్ని, దర్భలు, సమిధలు, హవిస్సు,ఆజ్యాదులు, తానైనవాడు.

975. యజ్ఞవాహనః = యజ్ఞములు ఫలమునిచ్చునట్లు చేయువాడు.

శ్లో॥ యజ్ఞభృ, ద్యజ్ఞకృ, ద్యజ్ఞీ, యజ్ఞభు, గ్యజ్ఞసాధనః,।
యజ్ఞాన్తకృ, ద్యజ్ఞగుహ్య, మన్న, మన్నాద, ఏవచ,॥ 105

976. యజ్ఞభృత్ = యజ్ఞమును భరించువాడు. సంరక్షించువాడు.

977. యజ్ఞకృత్ = సృష్టి, లయము లందు మహాయజ్ఞములు చేయువాడు. యజమాన స్వరూపుడు.

978. యజ్ఞీ = యజ్ఞము తానైనవాడు. యజ్ఞములందు ఆరాధింపబడువాడు.
979. యజ్ఞభుక్ = యజ్ఞఫలమును అనుభవించువాడు.
980. యజ్ఞసాధనః = తనను పొందుటకు యజ్ఞమే సాధనమైనవాడు.
981. యజ్ఞాంతకృత్ = యజ్ఞమునకు చివర జరుగు పూర్ణాహుతి ఫలమును ఇచ్చువాడు.
982. యజ్ఞగుహ్యమ్ = యజ్ఞరహస్యము అయినవాడు.
983. అన్నమ్ = 1.అన్నస్వరూపుడై జీవులను పోషించువాడు. 2.ప్రళయకాలమున జీవులను తనలో చేర్చువాడు.
984. అన్నాదః = జీవుని రూపమున అన్నము భుజించువాడు.

**శ్లో॥ ఆత్మయోని, స్స్వయంజాతో, వైఖాన, స్సామగాయనః,।**
**దేవకీనందన, స్స్రష్టా, క్షితీశః, పాపనాశనః,॥ 106**

985. ఆత్మయోనిః = తనపుట్టుకకు తానే కారణమైనవాడు. తనంతతానుగా పుట్టినవాడు. ఉపాదానకారణము
986. స్వయంజాతః = లోకములపుట్టుకకును, తానె నిమిత్త కారణమైనవాడు.
987. వైఖానః = భూమిని బాగుగాత్రవ్వగల వరాహ రూపుడై హిరణ్యాక్షుని సంహరించినవాడు.
988. సామగాయనః = సామవేదమును గానముచేయువాడు.
989. దేవకీనందనః = దేవకీతనయుడైన కృష్ణునిగా అవతరించినవాడు.
990. స్రష్టా = సృష్టికర్త తానే అయినవాడు.
991. క్షితీశః = భూమిని ఏలువాడు. దశరథ తనయుడైన శ్రీరామునిగా అవతరించినవాడు.
992. పాపనాశనః = తనను తలచి, కొలిచినవారికి కొంగుబంగారమై పాపములను పోగొట్టువాడు.

**శ్లో॥ శంఖభృ, న్నందకీ, చక్రీ, శార్ఙ్గధన్వా, గదాధరః,।**
**రథాంగపాణి, రక్షోభ్య, స్సర్వప్రహరణాయుధః,॥ 107**

993. శంఖభృత్ = 'పాంచజన్య'మను శంఖమును ధరించువాడు.
994. నందకీ = 'నందక'మను ఖడ్గమును ధరించువాడు.



995. చక్రీ = 'సుదర్శనమ'ను చక్రమును ధరించువాడు.
996. శార్ఙ్గ ధన్వా = 'శార్ఙ్గ మ'ను ధనుస్సు ధరించువాడు.
997. గదాధరః = 'కౌమోదకీ' అను గదను ధరించువాడు.
998. రథాంగపాణిః = 1.రథచక్రమును ధరించి భీష్మునిపైకి యుద్ధమునకు వెళ్ళినవాడు. 2.విజయుని రథసారథియై పగ్గములను ధరించినవాడు.
999. అక్షోభ్యః = కలవరపాటు లేనివాడు. ఎట్టి పరిస్థితులలోను కలత చెందనివాడు.
1000. సర్వప్రహరణాయుధః = దుష్టశిక్షణ, శిష్టరక్షణముల కొఱకు సర్వవిధములైన ఆయుధములు ధరించువాడు.

శ్రీసర్వప్రహరణాయుధఓంనమఃఇతి= ఓంకారస్వరూపుడై, ఆయుధధారియై సర్వరక్షకుడైన ఆశ్రీమన్నారాయణమూర్తికి నమస్కరించుచున్నాను.

**-ప్రార్థన-**

**శ్లో॥ వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీచ నందకీ॥**
**శ్రీమాన్నారాయణో విష్ణు ర్వాసుదేవో உ భిరక్షతు॥ 108**

1. వనమాలీ = 'వైజంతి'యను వనమాలికను ధరించినవాడు.
2. గదీ = 'కౌమోదకీ' యను గదను ధరించినవాడు.
3. శార్ఙ్గీ = 'శార్ఙ్గ ము' అను ధనస్సును ధరించినవాడు.
4. శంఖీ = 'పాంచజన్యమ'ను శంఖమును ధరించినవాడు.
5. చక్రీచ = 'సుదర్శన'మగు చక్రమును ధరించినవాడు.
6. నందకీ = 'నందకమ'ను ఖడ్గమును ధరించినవాడు
7. శ్రీమాన్ = శ్రీపతియు
8. నారాయణః = పాలసముద్రమున పవళించుస్వామియగు నారాయణుడును
9. విష్ణుః = సర్వవ్యాపియునగు
10. వాసుదేవః = వసుదేవుని కుమారుడుగు వాసుదేవుడు
11. అభిరక్షతు = (మమ్ములను) భక్తులను రక్షించుగాక

# ఆలయ ప్రాముఖ్యత

బాషాప్రవీణ, విద్యాప్రవీణ
**డాక్టర్, తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి M.A. Phd.**

ఓం నమో నారాయణాయ

సంస్కరింపబడిన జాతి జీవన విధానాన్ని సంస్కృతి అంటారు. తినటం, కనటం, రాగం, ద్వేషం మొదలైన జంతు సామాన్య లక్షణములతో బాటు మంచి, చెడులను విచారించి మంచిని అనుసరించగల జ్ఞానం మానవుల ప్రత్యేకత. సమాజంలోని అందరిమేలు కోరి ప్రవర్తించటం నాగరికత అవుతుంది.

అనుభవంలో మానవాతీత శక్తులను గుర్తించి, ఆశక్తులను దైవంగా భావించి వివిధ నామరూపాలతో చిత్రించి, తద్వారా క్రమశిక్షణతో గూడిన నడవడితో బాటు ఆత్మ విశ్వాసాన్ని పెంపొందించుకొని అనుభవాన్ని అందరితో పంచుకొనుట మానవత్వంగా దర్శనమిస్తుంది. సత్యము, అహింస, త్యాగము, ఆ మహాత్ముల లక్షణములుగా తెలియబడతాయి. ప్రకృతి సర్వము (పంచభూతములు) పరమాత్మ స్వరూపమేయని తెలుసుకొని అన్నింటిని ఆదరించటం, అభిమానించటం దైవీ గుణ సంపదగా భారతం, భగవద్గీత వివరించాయి. అసూయ, ద్వేషాలు పతన హేతువులని సూచించాయి.

ధర్మభూమియైన మన భారతదేశం, కర్మభూమి, యోగభూమియై వర్ధిల్లటం ప్రపంచం గుర్తించి, కీర్తించింది. భారతీయ ఋషులు, శాంతిని, ఆనందాన్ని, లోకక్షేమమును ఆకాంక్షించి తపించి ఆధ్యాత్మిక జ్ఞానాన్ని సంపాదించి ప్రపంచానికి పంచిన మహానుభావులు, ఆధునిక యుగంలోను శ్రీరామకృష్ణ పరమహంస శిష్యులలో అగ్రగణ్యుడు శ్రీ వివేకానంద, అమెరికాలో జరిగిన సర్వమత వేదాంత సభలో భారతీయ ఆధ్యాత్మిక విజ్ఞాన వైభవాన్ని నిరూపించి సభ్యులను ఆశ్చర్యపరవశులను చేసి, విశ్వము యొక్క కనులు తెరిపించాడు.

కేవల భౌతిక విజ్ఞానము ప్రపంచములోని పదార్థ జ్ఞానమును వివరించి సుఖ, భోగములను పెంపొందించి తుదకు అసంతృప్తిని మిగుల్చుచుండగా ఆధ్యాత్మిక జ్ఞానము మానవులకు జీవితము యొక్క యధార్థ స్థితిని తెలియజేసి శాంతిని, సంతృప్తిని, పరమానందమును ప్రసాదిస్తుంది.



సృష్టి, స్థితి లయములు ప్రకృతి లక్షణములు. ప్రకృతికి అతీతుడు ఆధారమైనవాడు పరమేశ్వరుడు. ఆద్యంతములు లేని ఆ యనంతశక్తిని శరణువేడుట వివేక జీవులైన మానవుల కర్తవ్యము.

ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వనియందుడిందు పరమేశ్వరుఁడెవ్వడు మూలకారణం బ
బెవ్వఁడనాదిమధ్యలయుఁడెవ్వడు సర్వము దానయైనవాఁ
డెవ్వఁడు వానినాత్మభవునీశ్వరునేశరణంబు వేడెదన్

భాగవతము - పోతన

విశాల దృష్టిగల భారతీయ ఋషులు ఆ దైవమును, శక్తి, శివ, విష్ణు, సుబ్రహ్మణ్య, వినాయక మొదలైన నామ రూపములతో తలచుట హరిహరాద్వైతమును నిరూపించుచున్నది. జీవుల అభిరుచిని బట్టి దైవమును ఏరూపముతోనైనను ఏనామముతోనైనను కొలుచుట అభిలషణీయముగా తోచుచున్నది. భక్తితత్త్వముద్వారా మనస్సు పరిశుద్ధమై సత్యధర్మములయందనురక్తి, దయా స్వభావము కలిగియుండుట ఉత్తమ మానవ లక్షణములుగా కీర్తింపబడినవి.

చేతులారంగ శివుని బూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తినుడువడేని
దయయుసత్యంబులోనుగాఁదలపఁడేని
కలుగనేటికి తల్లుల కడుపుచేటు

భాగవతము - పోతన

పూర్వము ఆలయములు విజ్ఞాన కేంద్రములుగా విలసిల్లు చుండెడివి. అక్కడ ధర్మమును గూర్చిన చర్చలు జరుగుచుండెడివి. పురాణములు వివరించి చెప్పబడుచుండెడివి. విద్యార్థులకు విద్య నేర్పబడుచుండెడిది. శిల్పము, చిత్రము నాట్యము, సంగీతము మొదలగు కళలు పోషింపబడెడివి. వివిధ వృత్తులు ఆదరింపబడెడివి. భగవంతుని దర్శించుకొని ఏకాంతమున తమ కోర్కెలు విన్నవించుకొని, ఆవేదనలు నివేదించుకొని సర్వాంతర్యామి, సర్వరక్షకుడైన ఆతని శరణు వేడుట జరుగుచుండెడిది. ఎంతో ప్రయోజనముగల ఈ ఆలయ సంస్కృతి-సంప్రదాయములను రాజులు ఆదరించి మణి మాన్యములిచ్చి పోషించారు. శ్రీకృష్ణదేవరాయల వంటి వారెందరో ఆవిషయమున వారు చేసిన

దాన ధర్మములను శిలాశాసనముల ద్వారా లోకమునకు తెలియజేశారు. ఈనాడు ప్రజలేపాలకులు వారే ఇట్టి ధర్మకార్యములకు పూనుకొని సమాజాభ్యుదయమునకు పాటుపడుట గమనించుచున్నాము. గతములో శ్రీరాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారు గుంటూరు జిల్లాలోనే కాక ఇతర ప్రాంతములందును ఎన్నో దేవాలయములను పునరుద్ధించుట చరిత్ర ప్రసిద్ధము. సమాజమునకు ఆదర్శప్రాయము.

భూమిలో నీరు అంతటా ప్రవహించుచున్నను సులభముగ మనకు లభించుటకు బావి లేక బోరు త్రవ్వినట్లు, నదిలో, చెరువులో అపాయములేని విధముగ రేవులు ఏర్పరుచుకొని నీరు ఉపయోగించుకొనుచున్నట్లు పంచభూతమయుడైన ఆ పరమాత్మ ప్రపంచమంతట నిండియుండినవాడైనను ఆదివ్యశక్తిని గుర్తించి, అర్చించుటకు ఆలయములు ప్రముఖ పాత్ర పోషించుచున్నవి.

సమాజమును తీర్చిదిద్దుటలో ఆలయములు సంస్కార స్థానములుగా, శిక్షణా కేంద్రములుగా ఉపయోగపడి ఉత్తమ పౌరులను తీర్చిదిద్దుటలో సహకరించును. గావున పెద్దలు ఆ ఆలయ నిర్మాణములో శ్రద్ధ వహించారు. సంప్రదాయ సంపన్నులు శివాలయములేని ఊరిలో భోజనము చేయుటకు ఇష్టపడరనుటలో దాని ప్రాముఖ్యత తెలియుచున్నది సప్త సంతానములలో ఆలయ నిర్మాణ బాధ్యత యొక భాగము.

పొన్నూరు మండలము, చింతలపూడిలో ప్రజల సహాయ సహకారములతో 2002లో శివాలయము, 2011లో విష్ణాలయము నిర్మింపబడి, ప్రతిష్ఠలు నిర్వహించబడినవి. అనుబంధముగ నవగ్రహములు, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి వార్ల ప్రతిష్టలు జరిగినవి. వివాహాది శుభకార్యక్రమములు చేసుకొనుటకు కళ్యాణ మండపము నిర్మింపబడినది. ప్రజలందరి ఉత్సాహ ప్రోత్సాహములతో శ్రీ మద్దుకూరి ఆదిశేషారావు, శ్రీమతి కస్తూరిబాయి పుణ్య దంపతులు ఈ కార్యక్రమము నిర్వహించుటకు పూనుకొన్నారు. ఆగమశాస్త్ర పద్ధతిననుసరించి జరిగిన ఈ పతిష్ఠా కార్యక్రమములలో విశేషముగ అన్నదానము జరిగినది. ఆనందముతో ప్రజలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. నేను వారిని, వారికి సహకరించిన వారిని, హృదయపూర్వకంగా అభినందించుచు, ధన్యవాదములు తెలియ జేయుచున్నాను.





రచయిత

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

## డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M.A. Ph.D

### శాస్త్రిగారి ఇతర రచనలు

1. శ్రీ రామకథామృతము - సమగ్ర సమీక్ష ఆంధ్రా యూనివర్సిటీ వారిచే Ph.D. పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం-సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం-సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పావనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము)
9. మాటలంటే మాటలా ?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము
13. శ్రీ వీరాంజనేయ శతకము
14. శ్రీ సత్యనారాయణ శతకము
15. శ్రీ కపోతేశ్వర శతకము
16. శ్రీ రాజరాజేశ్వరీ శతకము
17. శ్రీ త్రికూటేశ్వర శతకము (అముద్రితము)